# బ్రహ్మవిద్యాసారము

యోగీ లెడ్‌బీటరు గారి

**"An Outline of Theosophy"**

అనుగ్రంథము

అ. మహాదేవశాస్త్రి, బి. ఏ.

గారిచే ఆంధ్రీకరింపబడినది.





PUBLISHED BY
THE *VASANTA INSTITUTE*, ADYAR, MADRAS
1923

# బ్రహ్మవిద్యాసారము

యోగి లెడ్‌బీటరు గారి

**"An Outline of Theosophy"**

అను గ్రంథము

అ. మహాదేవశాస్త్రి, B.A., F.T.S.

గారిచే ఆంధ్రీకరింపబడినది.



PUBLISHED BY

THE *VASANTA INSTITUTE*, ADYAR, MADRAS

1923

# అవతరణిక

యోగి లెడ్‌బీటరు గారు An Outline of Theosophy అను పేర వ్రాసియుండు చిన్నగ్రంథము బ్రహ్మ విద్యాసారము అను పేర ఆంధ్రీకరింపబడియున్నది. ఇందున Theosophy అను బ్రహ్మవిద్యాదర్శనమందలి మూలతత్వములు సరళముగను న్యాయయుక్తముగను ప్రతిపాదింపబడియున్నవి. Theosophy అను దాని తత్వమును తెలిసికొన నిచ్ఛయించువారు మొదట చదువదగిన గ్రంథ మిది. ఈ గ్రంథకర్త స్వానుభవసిద్ధ విషయములనే యాధారముగ జేసికొని ప్రకృత ఆధికారులకు అనుష్ఠానపర్యవసాయి' కాదగు అంశములను బహు హృద్యముగ వివరించియున్నారు. కావున చదువరులు ప్రతియొక అంశమును సావధానముగ చదివి మననచేసి అవగాహనము చేసికొనదగును. మూలగ్రంథమును హెచ్చు తక్కువలు లేక అనువదించుట అంత సులభము కాకపోయినను అట్లు చేయుటయే అనువాద

కుని యుద్దేశము. ముఖ్యప్రమేయాంశములును వాని పరస్పర సంబంధములును సులభముగ తెలియవచ్చుటకై ప్రతిఖండమునకు (paragraph) మొదట అందలి ప్రమేయాంశము సంగ్రహముగ సూచితమైయున్నది. ఇట్టి ప్రమేయాంశ విభాగము మూలగ్రంథమున కానరాదు. గ్రంథసారము స్పష్టమగుటకై ఈ విభాగము విషయ సూచికలోకూడ జేర్చబడియున్నది. ఈ గ్రంథమును బాగుగ చదివి తెలిసికొనువారికి Theosophy దర్శనమును బోధించు గ్రంథములపైకి ఇది అత్యుపయుక్తమనునది స్పష్టమగును.

అ. మహాదేవశాస్త్రి

# విషయసూచిక

పుటలు

పుటలు

పుటలు

B

పుటలు

---

# బ్రహ్మవిద్యాసారము

## ప్రథమాధ్యాయము

### బ్రహ్మవిద్యావిచారపద్ధతి

#### I. బ్రహ్మవిద్యాస్వరూపము

1. అతీంద్రియవిషయముల యథార్థజ్ఞానము అసాధ్యమని కొందఱు.—ఈశ్వరుడనువాడొకడు గలడా? అతని స్వభావమేది? అతనికిని మానవులకును గల సంబంధమేమి? మానవకోటియొక్క పూర్వపు చరిత్ర మేమి? ముందు అది యేమగును? ఇట్టి మూలభూత ములగు తత్త్వముల గుఱించి చిరకాలముగ అనేకులు చర్చించుచు వాదించుచు నున్నారు. ఈవిషయముల పై జనులు అత్యంతముగ భిన్నాభిప్రాయపడి ఒకరిమత మును మఱియొకరు అతికటువుగ ఆక్షేపించి పరిహ సించి యున్నారు. ఇందువలన సామాన్యముగ జనులకు ఒక దృఢాభిప్రాయము గలిగియున్నది. అట్టి విషయము

లందెల్ల తత్త్వమును యథార్థముగ తెలియుటకు మార్గము లేదనే వారు గ్రహించియున్నారు. అట్టి విషయములను యథార్థముగ నిశ్చయించుటకు దగిన జ్ఞానసామగ్రి సరియైనది మనకు లేదనియు, ఇపుడుండు సామగ్రిచే అట్టివిషయముల గుఱించి మనము నిర్ణయించు అంశములన్నియు నిరాధారములనియు, తన్మూలకమగు సిద్ధాంతములన్నియు కేవల ఊహాపోహా సిద్ధములనియు, ఇప్పటి విచారపరులు ప్రాయికముగ అభిప్రాయము గొనియున్నారు. ఈవిషయములందు నానామతములవారు నిర్ణయరూపముగ తమతమ సిద్ధాంతముల జెప్పువారున్నారని తెలిసియున్నను, విచారపరులగు ఇప్పటివారికి అట్టిసిద్ధాంతములు నమ్మదగనివిగ నుండుటవలన పైజెప్పినటుల వారు సంశయపడుచున్నారు.

2. అది సాధ్యమే యని సిద్ధాంతము.—విచారపరులగు లౌకికులకు గల యీయభిప్రాయము ఇప్పటి సందర్భమున సహజముగనే యున్నది. ఆయినను న్యాయముగ విచారించి చూచిన, అది నుతరాం తప్పు అభిప్రాయమని తోచును. పైచెప్పిన (ఈశ్వరసద్భావము

మొదలగు) విషయములందు యథార్థజ్ఞానము గలుగ జేయదగిన ప్రమాణప్రమేయాంశములు లేవని చెప్ప దగదు. అట్టి అంశములు బ్రహ్మవిద్యా (Theosophy) సంప్రదాయమున గావలసినంత ఉన్నవి. అయినను ఈవిషయమున బ్రహ్మవిద్య (Theosophy) కును మత సంప్రదాయములకును భేదమొకటి గలదు. మతసంప్ర దాయములవారు తాము చెప్పు అంశములకెల్ల ఆయా మతగ్రంథవచనములనే ప్రమాణముగ జెప్పుదురు. ఆప్రమాణముల యాధారముపైననే అట్టివిషయములను నమ్మవలె నందురు. బ్రహ్మవిద్య (Theosophy) యందలి ప్రమేయాంశములను కేవల వచనములబట్టియే నమ్మవలె నని లేదు. మనమై పరీక్షించి ఆ అంశములను అనుభవ మునకు తెచ్చుకొనుటయే బ్రహ్మవిద్యామార్గము. మత సంప్రదాయములవలె అదియు ఒక వేఱుమతమని చెప్ప దగదు. ప్రాచీన దర్శనములవలె బ్రహ్మవిద్య (Theosophy) యు ఆయామతముల ప్రమేయాంశములను ఉపపా దించి చెప్పును. ఇపుడు ప్రచారములోనుండు మత ములకు విరుద్ధమైన అంశములను చెప్పకుండుటయేకాక ఆమతముల సిద్ధాంతముల నన్నిటిని సమర్థనచేయును.

ఏమతమునన్నైనను సుతరాం అయుక్తమైన అంశము గన్పడినయెడల సర్వనియామకుడగు భగవంతుడు ఎప్పటికిని అట్లు చేసియుండడని భావించి దానిని వదలివేయును. సర్వమతములయందును ఒక్కొకటియందును యుక్తమనితోచు అంశములనన్నిటిని పరిగ్రహించి సమర్థించి వాని ఆవశ్యకతను చూపించుచు గ్రాహ్యాంశములనన్నిటిని సమరసమగు ఒక సిద్ధాంతముగ చేర్చిపెట్టును.

౮. నిర్ణయమయిన అంశములు. — ఈశ్వరసద్భావము మొదలగు ముఖ్యప్రమేయభాగముల నన్నిటను తత్వమును దెలియుట సాధ్యమనియే బ్రహ్మవిద్య (Theosophy) చెప్పును. ఇంతవఱకే ఇట్టి విషయములందు యథార్థముగ నిర్ణయింపబడిన అంశములు ఎన్నియో యున్నవనియును చెప్పును. ఇట్టి తత్వాంశములనే లోకముననుండు భిన్నభిన్నమతములన్నియును భిన్నభిన్నదృష్టిచే భిన్నభిన్నప్రకారముగ నిరూపించుచున్నవి. కాబట్టియే తత్వములకు వారు వారు ఇచ్చువేళ్లలోను, ముఖ్యముగ నమ్మదగినవని వారువారు నిశ్చయించియుండు అంశవిశేషములలోను, మతములందు పరస్పర భేదము కనుపడినను వాస్తవ

ముగ ప్రయోజనకారియగు అంశములలో—అనగా సత్పురుషుడు ఎట్లు వర్తించదగినది, ఎట్టి గుణములను తనలో అభివృద్ధిచేసికొనదగినది, ఎట్టి దోషములను వదలదగినది, ఈ విషయములలో—అన్ని మతములు ఒకరీతిని చెప్పుచున్నవి. ఇట్టి అనుష్ఠేయాంశములలో హిందూ—బౌద్ధ—పార్సి—మహమ్మదీయ—యూదియ—క్రైస్తవ మతముల బోధన ఏకవిధముగ నున్నది.

4. ప్రపంచ తత్త్వమును బోధించునది బ్రహ్మవిద్య.—ఇతరులకు చెప్పునపుడు బ్రహ్మవిద్య (Theosophy) అనగా ప్రపంచతత్వమును ఇప్పటి అనుభవమునకు తగునటుల న్యాయసిద్ధమగు విధమున ఊహించి నిరూపించు శాస్త్రమని మాత్రమే మనము చెప్పవచ్చును. అయినను బ్రహ్మవిద్యావిచారమును చక్కగ చేసినవారికి అది ఊహారూపమగు కేవల పరోక్షశాస్త్రము కాదు; మరేమనగా, అనుభవవిదితమగు వస్తుతత్వనిరూపణమే. అందు చెప్పబడియుండు ప్రతియొక విషయము పరీక్షించి ప్రత్యక్షానుభవమునకు తెచ్చుకొనరాదగినదే. దానికి కావలసిన యోగ్య

తను కష్టపడి సంపాదించికొనుటకు సిద్ధమగువారు ఆశాస్త్రముయొక్క ప్రమేయములను తామై పరీక్షించి అనుభవమునకు తెచ్చుకొనవచ్చును. ఈ రీతిన సాక్షాత్తుగ పరీక్షించి నిర్ణయించిన ప్రపంచస్థితిగతులను తెలియజేయు విద్యయే బ్రహ్మవిద్య (Theosophy) యనునది. ఇది మహాప్రపంచమున ఒకభాగమగు మనబ్రహ్మాండముయొక్క స్వరూపమును సంగ్రహముగ తెలుపును.

## II. బ్రహ్మవిద్యా సంప్రదాయము

5. బ్రహ్మవిద్య లోకమున నెల్లపుడు ప్రచారమున నుండెను.—ఈబ్రహ్మాండముయొక్క స్వరూపము ఎట్లు తెలియవచ్చినది? దాని కనిపెట్టిన వారెవరు? అని ఎవరైన అడుగవచ్చును. దాని కనిపెట్టినవారు వీరు అని చెప్పనలవికాదు. అదేలయనగా—సర్వకాలముననూ మానవకోటికి అది తెలిసియే యుండెను. కొద్ది కాలము మాత్రము లోకమున ఎచ్చటో కొన్ని భాగముల జనులు మఱచియుండినను ఉండవచ్చును. కాని ఒక అంశమేమో వాస్తవము. అదేమనగా— ఈవిద్యను సమగ్రముగ తెలిసిన సిద్ధపురుషుల సంఘ

మొకటి ఎప్పుడును ఉండినది. ఆసంఘమున జేరిన వారు ఒక జనపదమువారే కారు. ఉచ్చస్థితిబొందిన నానాజనపదములవారు అందు జేరియుండిరి. ఆసిద్ధ పురుషులవద్ద ఈవిద్యను మహాదరముతో నేర్చికొను శిష్యులు ఎల్లప్పుడును ఉండిరి. ఆవిద్యయందలి సామాన్యాంశములు మాత్రము ఆసంఘమున జేరని జనులకుగూడ తెలిసియే యుండెను. ఈ మహాసిద్ధ పురుషుల సంఘము పూర్వమువలె ఇపుడును ఉన్నది. వారిప్రేరణచేతనే వారిశిష్యులలో కొందఱమూలక ముగ ఈబ్రహ్మవిద్యోపదేశము పాశ్చాత్యజనులందు ఇపుడు నడచుచున్నది.

6. పాశ్చాత్యులందు దానిప్రచారము అంతగా లేదు.—అట్లయిన ఈతత్వార్థములను ఇంతకు పూర్వ ము ఎంతో కాలమునకు వెనుకనే ఆసిద్ధపురుషులు ప్రచారమునకు తెచ్చియుండవలెనని కొందరు అజ్ఞులు ఒక్కొకసారి గట్టిగకూసి ఆక్షేపింతురు. అట్టి తత్వార్థ ములను లోకమునకంత తెలుపక మానముగ నుండి నది అట్టి విద్యగలిగిన సిద్ధపురుషులకు ఉచితముగాదని యును అన్యాయముగ వారిని నిందించుదురు. దీనికంత

అజ్ఞానమే కారణము. ఆవిద్యను తెలియుటకు శ్రద్ధతో ప్రయత్నపడువారికెల్ల అది ఎప్పుడును లభించుచుండిన దను విషయము ఈ ఆక్షేపకులు మఱచియున్నారు. అట్టివిద్య వలయునను అపేక్ష పాశ్చాత్యజనులకు ఇపుడుకదా పుట్టియున్నది. వేలకొలది యేండ్లకాలముగ యూరోపుదేశమువారిలో ప్రాయికముగ అందరును అత్యంత మూఢభక్తి భరితమగు మతమును అనుసరించి వర్తించుచు తుష్టులైరి. కడపట ఆమతమందలి మౌఢ్యమును ఆభాసమును చూచి అందు వైరస్యము పుట్టగా నిరీశ్వరవాదమునే కొంతకాలము ఆశ్రయించిరి. ఈ నిరీశ్వరవాదమందునుకూడ అదే అహంభావమును అదేమౌఢ్యమును ప్రబలించినవి. ఇదంతయు అయినపైన ఇపుడుకదా కొందరు అహంభావమును వదలి కొంచెము వివేకులయినవారు తమకు తత్వాంశము తెలియదనుదానిని ఒప్పుకొని ఎక్కడనైన ఒకచోట తత్వార్థజ్ఞానము దొరకునా యని విచారించువారుగ నున్నారు.

7. ఇపుడు దానిని ప్రచారము చేయుటయందలి యుద్దేశము.—ఇట్లు న్యాయ్యమైన రీతిన విచారించు

వారిసంఖ్య ఇపుడును అతిస్వల్పమైనను అట్టివారినెల్ల ఒకచో చేర్చుటకే బ్రహ్మజ్ఞాన సమాజము (Theosophical Society) అనునది ఏర్పడియున్నది. ఈసమాజమువారు బ్రహ్మవిద్యావిషయమగు పుస్తకములను వ్రాసి ప్రకటించుచున్నారు. కావున ఇష్టపడువారెల్లరు అందు చెప్పియుండు మహాతత్వములను సావధానముగ గమనించి చదివి తెలిసికొని మననముజేసి నిర్ణయించికొనవచ్చును. ఇష్టములేనివారికి అట్టితత్వములను నిర్బంధపఱచియైనను ఉపదేశింపవలెనను ఉద్దేశము ఈసమాజమువారికి లేదు. కొందఱు మతబోధకులు ఏదోయొక మతమును తమకు అభిమతముగ జేసికొని దానిని అంగీకరించని వారినెల్ల నిత్యనరకమునకు బోదగినవారని నిందింతురు. ఈదురహంకారిమూఢులవలె ఈసమాజమువారు ఎప్పుడును అట్టి మోహాంధకారమున పడరు. మాసిద్ధాంతమును చెప్పినతోడనే అంగీకరించువారెటుల మోక్షమును పొందుదురో అటులనే ప్రకృతమున మాసిద్ధాంతమును ఉచితమని అంగీకరించుటకు మనస్సులేనివారుకూడ కాలాంతరముననైనను తత్వజ్ఞానముచే ముక్తికి అర్హులు

కాగలరని మేము బాగుగ తెలిసికొనియున్నాము. ఈ బ్రహ్మవిద్యాజ్ఞాన బలముచే మేమును మాబోటివా రితరులను వేలకొలది జనులు ఇహమున సంసారదుఃఖమును సులభముగ సహించికొనుచు మరణవిషయమున భయములేనివారై యున్నాము. ఇతరజనులుకూడ ఇట్టి ప్రయోజనమును పొందుదురుగాక యను ఉద్దేశము బట్టియే సామాజికులగు మేము ఇట్టి ప్రమేయముల గుఱించి వ్రాయుటయందును ఉపన్యాసము చేయుటయందును ప్రవర్తించి మాశక్తినంతయు విని యోగించుచున్నాము.

8. పాశ్చాత్యులలో బ్రహ్మవిద్యాసాధన సంపత్తు తక్కువ.—ఈబ్రహ్మవిద్యయందలి ముఖ్యాంశములు లోకమున ప్రాయికముగ అన్నిప్రదేశములందును వేలకొలదియేండ్లుగ స్థూలముగ తెలిసియే యుండెను. ఇపుడునుకూడ అట్లు తెలిసియే యున్నది. పశ్చిమ భూఖండమునందలి మనముమాత్రము మనకుగల జ్ఞానమే చాలునని అసంభావితమగు అహంభావమొకటి నుంచికొని అట్టిప్రమేయములను తెలిసికొనకయే యుండుట కాక వానిలోనేదైన ఒక అంశమును గుఱించి చెప్పి

నట్టైన దానిని పరిహసించి అలక్ష్యము చేయుచుంటిమి. ఇతరవిద్యలందువలెనే అధ్యాత్మవిద్యయందును యావజ్జీవము విషయవిచారము చేయువారికే విశేషాంశములను స్పష్టముగ తెలియ శక్యమగును. అట్టి విశేషాంశములను ఇప్పుడు సమగ్రముగ తెలిసికొనియుండు సిద్ధపురుషులు, వానిని సాక్షాత్తుగ పరీక్షించిచూచుటకు గావలసిన జ్ఞానసాధనములను బహుకాలముగ శ్రమపడి శ్రద్ధతో యత్నించి సాధించి, వానిమూలకముగ ఆ విశేషాంశములను తెలిసికొనిరి. ఈ అంశమున ఈ గుప్తవిద్యయొక్క సాధనమార్గమునకును ఇప్పటి విద్యల సాధనమార్గమునకును వ్యత్యాసమున్నది. ఇప్పటి విద్యాసంపాదకులు బాహ్యోపకరణములను సంస్కరించికొనుటయందే తమశక్తినంతను వినియోగించుదురు. అధ్యాత్మవిద్యాసంపాదకులు అట్లుచేయరు. వారు ఆంతరములగు జ్ఞానసాధనములను సంస్కరించుకొనుటయందే ప్రయత్నము చేయుదురు.

### III. బ్రహ్మవిద్యా ప్రమాణపద్ధతి

9. ఇంద్రియప్రసాదమువల్ల జ్ఞానము హెచ్చును—ప్రథమశిక్షారూపమగు ఈ బ్రహ్మవిద్యాసారసంగ్రహ

మున సాధనసంపత్తిని ఒనగూర్చికొను రీతిని విస్తారముగ చెప్ప నవకాశము లేదు. బ్రహ్మవిద్యా (Theosophy) విషయముగ వ్రాయబడియుండు ఇతర గ్రంథములందు సాధనమార్గము విస్తారముగ వివరింపబడియున్నది. ప్రకృతమున తెలిసికొనవలసినది ఏమనగా—సాధన సంపత్తి అంతయు స్పందాతిశయసంపత్తిన పర్యవసాన మగుచున్నది. అదెట్లన—మనుజునకు బాహ్యవిషయ జ్ఞానము చక్షురాది జ్ఞానేంద్రియములలో ఏ యింద్రియ ద్వారముగ వచ్చినను ఆవిషయము ఆజ్ఞానేంద్రియమున స్పంద (చలన) రూపముగ ప్రవేశించి అతనిని చేరు చున్నది. కాబట్టి మనుష్యుడు ఎంతెంత హెచ్చుగ బాహ్యస్పందములకు తనయందు అవకాశమిచ్చునో అంతంత బాహ్యవిషయజ్ఞానమును సంపాదించికొనును. ఇట్టి జ్ఞానశక్తిని హెచ్చించికొనినవాడు ప్రసన్నదృష్టి (Clairvoyant) అనువాడగును.

10. చిత్తశుద్ధిగలవానికే తత్వవిచారము సాధ్యము.—సామాన్య మనుష్యులకుంను దానికంటె హెచ్చుగ సూక్ష్మవిషయముల జూడు శక్తిగలవారి నందఱను ప్రసన్నదృష్టులు అని వ్యవహరించుట కలదు.

అయినను మఱియు సూక్ష్మతర సూక్ష్మతమములగు విషయముల గనదగు ఇంద్రియశక్తిని అభివృద్ధిచేయుచు వచ్చినయెడల, దానిచే నామనుష్యుని ఇంద్రియశక్తి హెచ్చి అతి ఉత్కృష్ట విషయములను గ్రహించుటకు శక్తి సిద్ధించును. అపుడు సూక్ష్మభూతమయములగు క్రొత్తక్రొత్త లోకములే యతనికి గోచరమైనటుల నుండును. వస్తుస్థితియందు వానిని (ఆదియందు కనుపట్టు లోకములనెల్ల) నూతనలోకములని చెప్పదగదు. అట్లుగాక, ఇంతవఱకు తెలిసియుండు లోకముల నవీన భాగములే గోచరమగుచున్నవని చెప్పదగు. ఇట్టి అనుభవబలముబట్టి అదృశ్యమగు ఒకగొప్ప ప్రపంచము యావజ్జీవము తనను చుట్టుకొనియున్నదనియును, దాని విషయమగు జ్ఞానము తనకు సుతరాం లేకపోయినను నానావిధములుగ అది తనయందు నెల్లపుడు వికారమును గలుగజేయుచున్నదనియును అతడు ఊహించును. క్రమముగ అట్టి లోకాంతరముల నెల్లను చూచి తెలిసికొనదగిన ఇంద్రియశక్తి లభించినపైన, వానిని యథావిధిగ పరీక్షించి చూచుటకును, ఒకేవిషయమును మరల మరల చూచుటకును, ఒకేవిషయమై తన

అనుభవమును ఇతరుల అనుభవముతో పోల్చిచూచు టకును, ఇట్టి అనుభవ విశేషములనెల్లను ఒకపదకముగ నుంచి చూచి విశేషాంశముల నూహించుటకును సాధ్య మగును.

11. తత్త్వవిచారఫలము.—ఇట్టి విచారము ఒక తూరికాదు. వేలకొలదిసార్లు నడిచియున్నది. ఇంతకు పూర్వము చెప్పిన సిద్ధపురుషులు ఇట్టివిచారము నెంత వఱకు చేయవచ్చునో అంత చేసియున్నారు. ఇది గాక ఈ మనబ్రహ్మజ్ఞానసమాజమువారిలోనుకూడ మేము కొందఱము అదేమార్గమున బహువిధమగు విచారము చేసియున్నాము. ఈవిచారముయొక్క ఫలి తాంశమేమనగా—ఆసిద్ధపురుషులు మనకు మొదలు చెప్పిన విషయములందు బహుభాగము అనుభవమునకు వచ్చి యథార్థముగ పరిణమించినదేకాక అదేవిషయ మును వారు చెప్పినదానికంటె ఇకను విస్తారముగను వివరముగను తెలుపుటకు కావలసిన ప్రమేయాంశ విశేషములు మాకు తెలియవచ్చినవి.

12. అనేకసంశయములు నివర్తించును.—సాధా రణ స్థితియందు దృష్టికి గోచరముకాని ఇట్టి ప్రపంచ

భాగమును చూడ శక్తివచ్చినతోడనే మనకు అత్యంత ప్రయోజనకరములగు అనేకసంగతులు క్రొత్తక్రొత్తవి తెలియవచ్చుచున్నవి. అట్టి తెలివి క్రమముగ హెచ్చుచురాగ మనకు పూర్వము ఏమిచెప్పుటకు తోచని అతిగహనముగ నుండిన లోకయాత్రావ్యవహారముల విషయమై నిస్సంశయముగ నిర్ణయింప గలిగి యున్నాము. దానిబట్టి ఇపుడు అనేకగూఢాంశములు మనకు స్పష్టమగుచున్నవి. ఇంతకాలము ఆయంశములు మనకు గూఢముగ నుండినదానికి కారణమేమిగ నుండవచ్చుననఇంతవఱకు వస్తుస్థితియొక్క అత్యల్ప భాగమునే మనము సాక్షాత్తుగ కనగలిగితిమి. ఇంత వఱకు ఆయావస్తువులను కనునపుడు మనము క్రింద నిలిచి, అనగా ఆవస్తువులు ఒకటికొకటికి సంబంధము లేక విడివిడిగ కనుపట్టుస్థలమున నిలిచికొని, చూచి నట్లాయెను. దీనికిబదలుగ ఆవస్తువులకంటె ఉన్నత మగు ప్రదేశమునకెక్కి అక్కడనిలిచి అవన్నియు పరస్పర సంబంధబడి చేరి అఖండముగ కనబడు స్థలము నుండి చూచినట్లు చూచినయెడల వాని యథార్థ స్వరూపము గోచరమగును. ఇంతవఱకు విచార

గ్రస్తముగనుండిన అనేకసందిగ్ధాంశములను ఒక నిమిష మున ఇపుడు మనకుండు జ్ఞానబలముచే నిర్ణయింప గలము. దీనికొక ఉదాహరణము చెప్పెదను. అదే మన—మనుష్యుడు చనినపైన ఏమగునను విషయ మందు వివాదము కలదు. ఆయామత విభాగముల వారు నానావిధముగ చెప్పుదురు. అతడు స్వర్గ మునకు పోవుననియు, నరకమున నుండుననియు, యాతనాలోకమున నుండుననియు చెప్పుచు, ఈవిషయ మున వారువారు పిచ్చిపిచ్చిగ నమ్మగూడని విషయ ములనెన్నిటినో చెప్పుచున్నారు. కాని ఇపుడు మనకు గలిగియుండు జ్ఞానముబట్టి అందున వాస్తవాంశమింత యని చెప్పగలము. ఇట్టి జ్ఞానముచే మన అజ్ఞాన మంతయు నాశమగుచున్నది. ప్రపంచగతియంత ఒకన్యాయ్యమగు పద్ధతి ననుసరించి నడచుచున్నదని కనబడుచుండుటవలన అజ్ఞానజన్యమగు భీతియంతయు తొలగి పోవుచున్నది. న్యాయ్యమగు ఈప్రపంచ రచన యిట్టిదని ముందు వివరించెదను.

---

## ౩వ అధ్యాయము

## బ్రహ్మవిద్యాసారాంశము

### I. బ్రహ్మవిద్య పరీక్షార్థము

1. సామాన్య తత్త్వాంశములే యిక్కడ ప్రతిపాద్యములు—ఇపుడు చెప్పప్రారంభించిన బ్రహ్మవిద్యను స్పష్టముగను సుగ్రహముగను చెప్పవలెననుట నా ఉద్దేశము. కాబట్టి ఇక్కడ ప్రసక్తమగు ప్రతివిషయమందును సామాన్యతత్త్వాంశముల మాత్రమే చెప్పెదను. విశేషాంశముల దెలియవలయువారు గొప్పగొప్ప గ్రంథములను, వేర్వేఱుగ ఒక్కొక విషయముగుఱించి వారువారు వ్రాసియుండు ఉపన్యాసములను, చదివి తెలిసికొనదగును. కావుననే ఈ చిన్నప్రకరణగ్రంథముయొక్క ప్రతియొక అధ్యాయమునను కడాన, ఈ మనోజ్ఞమైన విద్యను ఇకను లోతుగ విచారింప నపేక్షు

గలవారు చూడదగిన గ్రంథముల పట్టియొకటిని చేర్ప నుద్దేశించియున్నాను.

2. పరీక్షించి నిర్ణయించిన అంశములు:—ప్రకృతమున బ్రహ్మవిద్యావిచారముయొక్క ఫలితాంశరూపముగ కొన్ని సామాన్యతత్త్వాంశములు వెడలియున్నవి. వానిలో హెచ్చుగ మనస్సునకు తట్టియుండు అంశములను మొదట చెప్పెదను. వానియందు కొన్నివి నమ్మదగనివని అభిప్రాయపడువారును కొందఱుండవచ్చును. మఱికొందఱకు తమ పూర్వాభిప్రాయములకు అతివిరుద్ధములగు అంశములుండునట్లు తోచవచ్చును. అట్టివారిని గుఱించి ఒకవిషయమును మాత్రము జ్ఞప్తియందుంచికొనవలెనని వేడెదను. అదేమన—నేనిపుడు చెప్పుసిద్ధాంతము కేవల బుద్ధికల్పితము కాదు. అనగా అతీంద్రియవిషయమై కేవల అనుమానాది ప్రమాణములచే ఊహించిన అంశము కాదు. అథవా నేనొకడను మాత్రము కేవల శ్రద్ధాపురస్సరముగ నమ్మియుండు మతమును కాదు. ఇకేమనగా—నేను చెప్పునదంతయు అనుభవసిద్ధమగు వస్తుస్వరూపతత్త్వము. నేను మాత్రమేకాక ఇతరులు అనేకులుకూడ ప్రమాణ

పద్ధతి ననుసరించి మఱిమఱి పరీక్షించి నిశ్చయించిన సిద్ధాంతము.

౫. ఇతరులు పరీక్షించకయే నమ్మవలసినది లేదు— ఈ సిద్ధాంతవిషయమై చెప్పవలసిన మఱియొక అంశ మున్నది. అదేమనగా, కష్టపడి తగినంతకాలమును చెల్లించి ఇట్టి విషయములనుచూచి పరీక్షించుటకు కావలసిన యోగ్యతను సంపాదించికొన మనస్సుగల వాడు నేను చెప్పుప్రకారముగ వస్తుతత్త్వమును సాక్షాత్కరించి అనుభవమునకు తెచ్చుకొన గలుగును. నే నిపుడు వివరింప నుపక్రమించిన సిద్ధాంతమును ఒక ఔషధ మాత్రనువలె విచారింపక మింగవలసినది లేదు. అనగా అది కేవల శ్రద్ధవలననే నమ్మదగిన ఒకానొక మతవిశేషము కాదు. వారు వారు తామై పరీక్షించి చూడదగిన వస్తుతత్త్వమును, ముఖ్యముగ అందరు అవలంబించదగిన శ్రేయోమార్గమును, తెలుపుటయే నా యుద్దేశము. దీనిని చదువువారందఱు కండ్లుమూసి కొని విచారములేకయే నమ్మవలెనని నేను అడిగికొన లేదు. ఈ బ్రహ్మవిద్యాసిద్ధాంతము ఒక సంభావనీయమగు పక్షమని భావించి పరీక్షచేయదగినదని అడిగి

కానేరదను. నాకేమో అది కేవల సంభావనీయమాత్రమే కాదు; మఱేమనగా, అనుభవసిద్ధమై కార్యకారి యైన వస్తుస్థితియే అది.

4. ఆ పరీక్షవల్ల నష్టమేమియు లేదు—ఇంత వఱకు పరీక్షించిన పక్షములకంటె ఈ బ్రహ్మవిద్యా సిద్ధాంతము తృప్తికరముగ కన్పడినపక్షమందు— అనగా, ఇతరపక్షములకంటె ఇది ప్రపంచ స్థితిగతు లను గుఱించిన సంశయములను బాగుగ నివృత్తిచేయు నని తోచుపక్షమున—అనగా, విచారపరుని మనస్సున అంకురించు ప్రశ్నలలో హెచ్చుప్రశ్నలకు ఈ బ్రహ్మ విద్యాసిద్ధాంతము ఉత్తరములను తృప్తికరముగ నిచ్చు నట్లుండు పక్షమున—అపుడు పరీక్షకుడు బ్రహ్మవిద్యా విచారమును ముందుసాగించగా నావలెనె దినదినము హెచ్చుచుండు తృప్తిని ఆనందమును పొందునని నేను దృఢముగ నమ్మియున్నాను. అట్లుగాక వేఱొకమతము దీనికంటె శ్రేష్ఠమని తోచినపక్షమున ఈ బ్రహ్మవిద్యా విచారమువల్ల నష్టమేమియు గలుగనేరదు. ఈ విచా రమువల్ల ఒక సంఘముజనులందరు నమ్మియుండు మత విషయముల గుఱించి అట్టివిచారకుడును కొంచెము

తెలిసికొనెను. కాని, ఆజనులు నమ్మియుండు అంశములు వాడు నమ్మటకు గాలేదు. ఇందువలన అతనికి ఏమి నష్టము? అయినను, ఈ బ్రహ్మవిద్యాసిద్ధాంతము చెప్పునది సత్యమను నమ్మిక నాకు అతిదృఢముగ నుండుటవలన అతడును ఒకానొకకాలమందు—శీఘ్రముననో కాలాంతరముననో—ఈ బ్రహ్మవిద్యా సమాజమువారిలో ఏకీభవించి మేము తెలిసియుండులాగుననే అతడును తెలియగలడని నిశ్చయముగ చెప్పగలను.

## II. ప్రమేయవిభాగము

౫. మూలతత్వములు—మన సమాజమువారు ఆదియందు బ్రహ్మవిద్యనుగుఱించి వ్రాసిన ఒకానొక గ్రంథమున “మూలతత్వార్థములు మూడుగలవు, అవి పరమార్థసత్యములు, ఎల్లపుడు అభాధ్యములు, ఎప్పటికి నష్టమగునవికావు. కాని చెప్పువారులేక ప్రకటము గాక యుండవచ్చును” అని చెప్పబడియున్నది. అవి ప్రాణమువలె ముఖ్యమహాతత్వములైనను మనుజుని యతిసరళబుద్ధికి దగినటుల సరళముగ నున్నవి. వానిని ఇప్పటి సందర్భానుసారము చెప్పినట్లైన,

నేనుప్రకృతము చెప్పనుద్దేశించిన మహాతత్త్వములను చెప్పినట్లగును.

6. ఈపరికరణమున చెప్పవలసిన అవాంతర తత్త్వములు—తరువాత ఆమూడు తత్త్వాంశములనుండి సహజముగ సిద్ధించు కొన్ని అవాంతర తత్త్వములను చెప్పెదను. ఇది ఈ పరికరణమందలి రెండవ అంశము.

7. ప్రయోజనములు—మూడవ అంశమేమన, ఆ అంశములను నిష్కృష్టముగ తెలిసికొనుటచే అవశ్యముగ ఫలించు ప్రయోజనభాగములందలి ముఖ్యభాగముల కొన్నిటిని చెప్పెదను.

8. వాని వివరణ—ఇట్లు ప్రపంచ రచనవిధమును ఒకపదకముగ చూపినపైన అందలి ఒక్కొక అంశమును క్రమముగ, ఆయావిషయములందు ప్రవేశమాత్రము గలుగజేయు ఈ గ్రంథమునకు దగిన సరళరీతిన, వివరించెదను.

## III. మూలతత్త్వము

9. ఈశ్వరవిషయము—ఈశ్వరుడున్నాడు. అతడు మంగళ స్వరూపుడు, అనగ, అతనివల్ల అందఱికు

మంచిదే కలుగును. మనలోపలను వెలుపలను ఉండు వాడై మనకు జీవశక్తిని గలుగజేయు మహాపురుషుడు. అతడు మృతిజెందునాడు కాడు. సర్వదా ఉపకారి. అతనిని వినుటకు చూచుటకు ముట్టుటకును సాధ్యముకాదు. అయినను తెలియవలయువారికి తెలియనగును.

10. మనుష్యవిషయము—మనుష్యునికి (స్వరూపతః) మరణములేదు. అతనికి ముందు లభించదగు భాగ్యమును మహిమను ఇంత అంత అని చెప్పవలవికాదు.

11. ప్రపంచవిషయము—ప్రపంచముయొక్క స్థితిగతులు నిరుపాధిక న్యాయరూపమగు ఈశ్వరాజ్ఞానియమమునకు లోబడియున్నవి. కాబట్టి ప్రతియొకమనుజుడును నిజముగ తనలోనుండు గుణదోషములను తానే నిశ్చయించికొనదగినవాడు. తనకు భాగ్యమును దార్భాగ్యమును తానే విధించికొనదగినవాడు. తాను జీవించు ప్రకారమును తానె నిర్ణయించికొనదగినవాడు. తనకు బహుమానమునుగాని దండననుగాని తానే తెచ్చుకొనును.

## IV. అవాంతరతత్త్వములు

12. ఈశ్వరుని గుఱించినవి— ఈ మూలతత్త్వము లందు ఒక్కొకటికి సంబంధపడి వానినుండియే సిద్ధించి వానికి వివరణరూపముగ నుండు మఱియు నితర తత్త్వాంశములు గలవు. మొదటి మూలతత్త్వమునుండి సిద్ధించు అంశము లెవ్వియనగా—

(1) పైపై చూచుటకు వేఱువిధముగ నున్నను, విచారించి చూచినయెడల, పదార్థములన్నియు లోక హితముకొఱకే (భగవంతుడు) బుద్ధిపూర్వకముగ నిర్మించిన విధముగ నడుచుచున్నవి. అన్ని సంద్భములు ఎంతప్రతికూలముగ కనబడినను, వాస్తవముగ ముఖ్య కార్యసిద్ధికి గావలసినవిగ నున్నవియేకాని వేఱు విధముగ లేదు. మనచుట్టుబట్టుననుండు అన్నిసంనివేశములును, విచారించి తెలిసికొనినయెడల, మన పురోభివృద్ధికి అనుకూలములుగ నున్నవేకాని ప్రతికూలములు కావు.

(2) ఇట్లు (భగవంతుడు చేసిన) ప్రపంచరచన యంతయు మనుష్యుని అభివృద్ధికి అనుకూలముగనే యుండుటబట్టి, దానిని ప్రయత్నపడి అవగాహన చేసి కొనుట అతని కర్తవ్యము అనునది స్పష్టము.

(3) ఇట్లు దానిని బాగుగ అవగాహన చేసికొనిన పైనే తనబుద్ధినంతయును వినియోగించి అట్టి ప్రపంచ రచనయొక్క ఉద్దేశమును అనుసరించి అందున తాను సహాయపడుట మనుష్యుని కర్తవ్యము.

13. మనుష్యుని గుఱించినవి.—రెండవ మూలతత్వ మునుండి సిద్ధించు అంశము లేవియన—

(1) వాస్తవముగ మనుష్యుడనగ జీవుడు. దేహ మనునది అతనికి జేరిన సొత్తుకాని అతడేకాదు.

(2) కాబట్టి మనుష్యుడు ఏవస్తువును చూచినను తాను జీవుడను భావముతో చూడదగును. పరస్పర విరుద్ధమగు కార్యముల జేయుసందర్భమున ఎట్లు నడవ దగినదని సంశయము వచ్చినప్పుడు జీవుడే తానను ఉత్కృష్టభావము ననుసరించి నడవదగునే కాని దేహ మే తానను నికృష్టభావముతో నడవగూడదు.

(3) మనము సామాన్యముగ మనుష్యుని జీవిత కాలమనునది అతని వాస్తవమగు మహాజీవితకాల ముందు ఒక దినమువంటిది.

(4) జనులకు సామాన్యముగ చావు అనునది ఎంత గొప్పవిషయముగ కనబడునో అంతగొప్పది

కాదు. ఏలయనగా, చావు ఎన్నటికిని మనుష్యుని బ్రతుకుయొక్క చివరకాదు. మనుష్యుఁడు వాస్తవమగు తన మహాజీవితయాత్రయందు ఒక అంచెనుండి మఱియొక అంచెకు పోవుటయే మరణమనునది.

(5) దీనికివెనుక అపరిమితకాలముగ మనుష్యుఁడు చైతన్యవికాస (Evolution) మును పొందుచు వచ్చియున్నాఁడు. దాని విచారము అతిమనోహరము, అతిరంజకము. అందువలన అనేకవిషయములు తెలియగలము.

(6) మనుష్యుని ముందటి అభివృద్ధియు అతి మహిమగలది. దాని విచారము ఇకను మనోహరిమైనది. ఆ విచారమువల్ల మఱియు హెచ్చు విషయములు మనకు తెలియరాగలవు.

(7) మనుష్యుఁడుగనుండు ప్రతిజీవుఁడును ప్రకృతమున ధర్మమార్గమును వదలి ఎంతదూరము పోయియుండునట్లు కనబడినను కాలక్రమమున ఆత్యంతికక్షేమమును పొందగలఁడనుట సత్యము. అందున నేమియు సంశయము లేదు.

14. ప్రపంచమును గుఱించినవి.—మూఁడవమూల తత్వమునుండి సిద్ధించు అంశములేవన—

(1) ప్రతియొక చిత్తవృత్తియు ప్రతియొక మాటయు ప్రితియొక శరీరచేష్టయు దానిదానికి దగిన ఫలము నిచ్చును. ఆ ఫలము బైటనుండువారెవరో చేయు బహుమానదండనలు కాదు. ఆ ఫలమునకును క్రియకును పరస్పరము కార్యకారణ సంబంధముండుట వలన క్రియయందే ఫలము అంతర్భూతముగ నున్నది. కార్యకారణము లనునవి ఒకేవస్తువుయొక్క రెండు అభేద్యాంశములు.

(2) భగవంతుని ఇట్టి దివ్యమైన ప్రపంచరచనను పూర్ణముగ విచారించి తెలిసికొనుట మనుష్యుని అవశ్యకర్తవ్యము. అందువలన అతనికి మహాప్రియోజనము గలదు. విచారబలముచే ఆరచనను అనుసరించి తన నడతను చక్కపెట్టుకొన వచ్చును. ఇతర విద్యలయందు పదార్థస్వభావజ్ఞానమును ప్రియోజనకారులగు క్రియలందు వినియోగించు లాగుననే ప్రిపంచరచనా విషయమగు జ్ఞానమును ఫలకారిక్రియలందు వినియోగించ వచ్చును.

(3) మనుష్యుడు తన్నుతానే నియమించుకొనుట అత్యావశ్యకము. దానివలన ఈశ్వరరచనానుసారము

మనుష్యుడు వివేకపురస్సరముగ లోకమున నడుచుకొన వచ్చును.

V. ప్రయోజనములు

15. ప్రయోజనము లనేకములు.—ఈ తత్వాంశములనెల్లను తెలిసికొని మననముచేసి అవగాహన చేసికొనినయెడల, మనము జీవించియుండుట యను విషయమున ఇపుడు మనకుండు అభిప్రాయము నిండుగ మాఱిపోవును. అట్టిమాఱ్పువలన గలుగు ప్రయోజనముల నన్నిటిని ఇక్కడ కనపఱచుట నాకు అసాధ్యము. ఏయంశములందు మాఱ్పగునో దానిని మాత్రము చెప్పగలను. తక్కినవన్నిటిని, అనగ ఆమాఱ్పువలన శాఖోపశాఖలుగ సిద్ధించు ప్రయోజనముల నన్నిటిని వాచకుడే ఊహించగలడనుటలో నేమియు సంశయము లేదు.

16. దృఢమైన నమ్మికయే ప్రయోజనకారి.—అయినను ఒక విషయమును మనస్సున నుంచుకొనవలెను. అదేమనగా— కేవల అస్పష్టమైన జ్ఞానము కార్యకారి కానేరదు. ప్రాయికముగ బహుమందికి తమతమ మతసంప్రదాయసిద్ధమగు అంశములందుండు నమ్మిక ఏవిధ

మునను ప్రయోజనకారి కాదు. ఏలయనగా—అట్టి నమ్మికవలన వారి నడతలో కొంచెమైనను మంచిది కలుగకున్నది. మన అనుభవమందలి వస్తువుల స్వభావమునందు—అనగా, నిప్పుకాల్చును, నీరుముంచును, ఈ మొదలగు విషయములలో—మనకుండునట్టి నమ్మిక ఈ మతసిద్ధాంత విషయములందు మనకుండినయెడల, అందువలన మననడతలో అత్యధికమగు మార్పు గలుగును. అనుభవసిద్ధమగు వస్తుస్వభావమందు వాస్తవముగ దృఢమైన నమ్మిక యుండుటవలన దాని ననుసరించియే మనము నడుచుచున్నాము. నిప్పుకాల్చు నని మనము నమ్మియుండుటబట్టి నిప్పు కాలుచోటికి మనము పోకయున్నాము. నీరు ముంచునను నమ్మిక యుండుటచే ఈదరానియెడల లోతు నీళ్లలోకి పోక హెచ్చరికతో నుందుము. ఇట్టి విషయముల జనుల కుండు నమ్మిక అంతవాస్తవముగను అంత దృఢముగ నుండుట యేలయనగా—ఆ నమ్మికకు ఆధారమగు వస్తుస్వభావజ్ఞానము దినదినమునకు అనుభవమువల్ల స్పష్టమగుచున్నది. అటులనే తత్వజ్ఞానము హెచ్చుచుండుటబట్టి బ్రహ్మవిద్యావిచారకునకుగూడ ఆవిద్య

యందలి తత్వాంశములందు వాస్తవముగ దృఢమైన నమ్మికయున్నది.

17. ముఖ్యప్రయోజనములు—కాబట్టియే బ్రహ్మవిద్యానిష్ఠులకు ఆసిద్ధాంతమందుండు నమ్మికవలన ఇపుడు వివరింపబోవు ప్రయోజనములు ఫలించుచున్నవి. అవి యేవనగా—

(1) ఈ సంసారవిషయమై యొక సమర్పకమైన జ్ఞానము కలుగుచున్నది. అనగా—మనమెట్లు ఇపుడు సంసారమున వర్తించదగినది, సంసారముయొక్క ప్రయోజనమేమి, అను నీయంశములు మనకు తెలియవచ్చుచున్నది. బాగుగ విచారించి తెలిసికొనినయెడల సంసారమున జీవించుటవల్ల ప్రయోజనము కద్దేకలదు అని నిర్ణయమగును.

(2) మనలను మనమే హద్దుననుంచికొని పురోభివృద్ధికి తెచ్చుకొనువిధమును మనము తెలిసికొందుము.

(౩) మనప్రియులకు మనము చేయదగు ఉత్తమ సహాయ మెట్టిదనునదియు, ఇపుడు మనతో సంబంధపడువారికిని, కడపట మానవకోటికంతయు, మనమెట్లు సహాయపడదగుననుటయు తెలిసికొనుదము.

(4) ప్రతియొక విషయమును అత్యుదారదృష్టితో న్యాయబుద్ధిచే చూచుచు అత్యల్పమగు కేవల స్వప్రయోజనదృష్టిని వదలివేయుదుము.

కావుననే

(5) సంసారకష్టములు అంతగొప్పవిగ కనబడవు.

(6) మన ప్రకృతస్థితిని గుఱించికాని మన ఉత్తరోత్తరస్థితిని గుఱించికాని మనకు అన్యాయము నడుచునను అభిప్రాయము మనకు లేదు.

(7) మరణమును గుఱించిన భయము మనకు బొత్తిగ లేదు.

(8) మనప్రియుల మరణమును గుఱించిన వ్యసనము మెండుగ తగ్గును.

*(9) మరణము తరువాతిగతిని గుఱించిన మన అభిప్రాయ మంతయు మెండుగ మాఱిపోయి ఆగతి మన పురోభివృద్ధికి ఏలాగున ఉపకారకమో యది మనకు తెలియవచ్చుచున్నది.

*(9), (10), (11)— ఈ మూడంశములు ఇప్పటి క్రీస్తుమతము వారికి అన్వయించునవి. కొంతమంది జీవులకు మోక్షము లభించదనియు కొందఱు నిత్యనరకమునకు పోవుదురనియు క్రీస్తుమతము వారును మఱికొందరును వాదించుట కలదు.—(అ. మ.)

(10) మతసిద్ధాంత ప్రకారముగ మనస్వాంత విషయమునను మన మిత్రులవిషయమునను భయమును వ్యాకులతయును గలుగుచున్నవి. మనమును మన మిత్రులును సంసారదుఃఖమును తరించలేమోయను భయము గలుగుచున్నది. అట్టి భయమంతయు బ్రహ్మవిద్యా తత్వజ్ఞానముచే తొలగి పోవును.

(11) మన ఉత్తరోత్తరగతిని గుఱించిన సంశయమువల్ల గలుగు వ్యథయంతయు తొలగిపోయి పూర్ణమైన శాంతిని అభయమును పొందియుందుము.

పైచెప్పిన విషయములలో నొక్కొకదాని దీసికొని సంగ్రహముగ వివరించెదను.

---

## మూడవ అధ్యాయము

## దేవుడు

### I. దేవుని స్వరూపము

1. దేవశబ్దముయొక్క అర్థములు—బ్రహ్మవిద్యా సారాంశములలోపల దేవుడొకడున్నాడనునది మొదటి దనియు మిక్కిలి గొప్పదనియు చెప్పియున్నాను కదా. దేవశబ్దమునకు అనేక అపార్థములు చేసియున్నారు. మహనీయమైన ఈశబ్దమును ఏ యర్థమున నేను ప్రయో గించెదనో దాని ఇపుడు అత్యవశ్యముగ వివరించవలెను. అనభిజ్ఞులు ఈశబ్దముయొక్క గంభీరమైన అర్థమును తెలియజాలక ఈశ్వర స్వరూపమును వేఱువిధముగ గ్రహించియున్నారు. అట్టి అర్థసంకోచమును విడిచి ధర్మస్థాపకులు ఆశబ్దమున కిచ్చియుండు గంభీరార్థము మరల రూఢికి వచ్చునట్లు నేను ప్రయత్నము చేసెదను. నేనిపుడు వర్ణించు గంభీరార్థము కూడ దేవుని వాస్తవ స్థితిని ఎప్పటికిని సూచింపజాలదని తెలిసికొనదగు.

2. దేవుని అఖండరూపము—దేవునకు రెండు రూపములు గలవు. వానిని మనము వివేచించి తెలియవలెను. వానిలో నొకటిది, అఖండ సత్తాస్వరూపము. అనగా, ఆ దేవుని ఉనికియే ప్రపంచమందలి పదార్థముల ఉనికిగ నున్నది. ఈ పరమ సత్తాస్వరూపుడగు దేవుడే ప్రపంచమొకటిని సృజించి పాలించుచు ఇంద్రియ గోచరుడై కనబడుచున్నాడు. ఇది అతని రెండవ రూపము. ఇవ్విధముగ ఇంద్రియ గోచరుడై పరిచ్ఛిన్న రూపముతో నుండు దేవునే పురుషు (personal God) డని మనము చెప్పదగినది. వాస్తవముగ దేవుడు పురుషుడను సంకోచమునకు లోబడువాడు కాడు. అతడు అన్ని పదార్థములందును ఉన్నాడు. అన్నిచోట్ల వ్యాపించియున్నాడు. వస్తుస్థితిలో సర్వమును అతడే. అఖండాకారుడును ఉపాధిరహితుడును సర్వాత్మకుడు నగు దేవునిగుఱించి "అతడున్నాడు" అని మాత్రము చెప్పగలము.

3. దేవుని మహాపురుష రూపము—మన ప్రకృతకార్య నిర్వాహమున కంతయు అత్యద్భుతమగు దేవుని దివ్యమూర్తిని తెలిసికొనిన చాలును. దానికంటె ఉత్కృష్టమగు రూపమును తెలిసికొనుట ఇపుడు ఆవ

శ్యకము కాదు. ఆ దివ్యమూర్తియగు దేవుని తెలిసి కొనుట సుతరాం అశక్యము కాదు. అట్టి దేవుడే మన ముందు బ్రహ్మాండమునకు నాయకుడు. అతనిని జ్ఞానులు నారాయణు (The Logos) డని చెప్పుదురు. భగవంతునందు ఎట్టి కల్యాణగుణము లున్నవని చెప్పుదురో అవి యన్నియు అతనికి చెల్లును. కొందరు మనుజులం దుండదగు (కోపము మొదలగు) దుర్గుణములను దేవునియం దారోపించి హేయమగు దోషములు కూడ అతనియం దుండునట్లు భావించుట కలదు. అట్టి దోషములు అతనియం దెన్నడును సంభవించుటయే లేదు. ప్రేమ, ధర్మసంపత్తు, వీర్యము, క్షమ, కరుణ, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము—వీనిని గుఱించి ఎవరెవరు ఎంతెంత చెప్పియున్నారో అదంతయు, ఇకను హెచ్చుగ కూడ, ఈ మన బ్రహ్మాండపాలకుడగు నారాయణునకు చెల్లుచున్నవి. "అతనియందే నావు జీవించుటయు, చలించుటయు, వసించుటయు" అను నది కేవల కవుల ఉత్ప్రేక్ష కాదు. పరంతు సాక్షాత్తుగ అనుభవసిద్ధమగు వస్తుస్థితియే. ఇట్లు నేను చెప్పుట కొందరికి ఆశ్చర్యముగ కనుపట్టును. కాని అది

యథార్థము. కాబట్టి నేను దేవుడనునపుడెల్ల నారా యణుడే నామనస్సున మొదట స్ఫురించును.

4. దేవుడు అనుభవ గోచరుడు—అనుభవ మేమి యు లేక, అట్టి దేవుడొకడుండిన బాగు అని మాత్రము నేను చెప్పలేదు. కేవల శ్రద్ధామాత్రముచే గాని అత డున్నాడని నేను నమ్మియుండుటయు లేదు. పరంతు, సూర్యుడు ప్రకాశించుట మనకు ఎట్లు అనుభవసిద్ధమో అట్లే నారాయణు డున్నాడనునది సాక్షాత్తు అనుభవ సిద్ధమగు విషయము. యోగాభ్యాసముచే ఇంద్రియము లను నిర్మలముచేసి ఇంద్రియముల సామర్థ్యముల హె చ్చించుకొని జ్ఞానశక్తి ప్రసారమును సాధించినవాడు విచారించినయెడల ఆ మహాపురుషుడగు శ్రీమన్నారా యణుడు అనుభవగోచరు డగును. ఇందువలన మనుష్య మాత్రుడు సంపాదించదగు యోగ సిద్ధిచేతనే నారా యణుని సాక్షాత్కరింపనగునని నా అభిప్రాయము గాదు. మఱియేమనగా—మన ఇంద్రియములకు ఇపుడు కనబడకయుండు ప్రాణుల స్థితిగతులను మనము విచా రించుచున్నాము. అట్టి ప్రాణులు లోకాంతరమునకు చేరినవారు కారు. వారుండునది వేఱులోకము కాదు.

ఈదృశ్యమగు లోకముననే ఉత్కృష్టభాగములందు వసించువారని చెప్పవచ్చును. వీరి విచారము చేయు నపుడు శ్రీమన్నారాయణుని కృత్యములును ఉద్దేశము లును నిస్సంశయముగ మనము తెలియగలందునకు నిదర్శనములు చుట్టుప్రక్కల అన్నిచోట్లను ఎన్నియో యున్నవని నా అభిప్రాయము.

౫. దేవుడు త్రిమూర్త్యాత్మకుడు — మతములన్ని టను ప్రసిద్ధమైన ఈశ్వరుడు త్రిమూర్త్యాత్మకుడను సిద్ధాంతము వెనుక చెప్పిన విషయములవలన యుక్త ముగ కనబడును. ఈ విషయమున మనమతములు చెప్పు అంశములందు అనేకములు సామాన్య జను లకు సమర్పకము కాకపోయినను వాని తత్త్వాంశము తెలిసినపైన సమర్పకమై అపూర్వార్థములను గూడ బోధించును. ప్రపంచ సృష్టిస్థితిరూపమగు అతని కార్యములను చూచినచో శ్రీ సూర్యనారాయణుడు (Solar Logos) త్రిమూర్త్యాత్మకు డనునది నిస్సంశయ మగును. త్రిమూర్త్యాత్మకుడైనను అతడు ఒకడే యను దానిని శాస్త్రము ఎంతోకాలమునకు పూర్వమే తెలిపి యున్నది. ఇది అతిగహనాంశముగ తోచవచ్చును.

ఆ విషయమును గుఱించి ఇప్పటి జనుల బుద్ధి గ్రహించు నంత చెప్పు గ్రంథములను నేను ముందు ఉదాహరించె దను. వాని జూచి తెలిసికొన వచ్చును.

6. దేవాంశభూతుడు జీవుడు—ఇంకొక అవశ్య ముగ తెలిసికొనదగు గొప్ప అంశము గలదు. అదే మన—శ్రీమన్నారాయణుడు మనకు బయట ఎటు లనో అటులనే మనలోపలను ఉన్నాడనునది. మనుష్యు డనువాడు వాస్తవముగ దేవాంశ సంభూతుడని యర్థము. పైపైన కనబడు ప్రపంచ స్థూలాంశము లందు దృష్టియుంచి సూక్ష్మాంశములను కానకుండు వారు ఈవిషయములందు సంశయపడి ఇకను వాదించుచునే యుండవచ్చును. ప్రపంచమందలి సూక్ష్మాంశములను విచారించు వానికేమో ఆ విష యమున సంశయము బొత్తిగ లేదు. దాని తత్వము అతనికి బాగుగ తెలసియున్నది. మనుష్యుడుగ నుండు జీవుడును అతని దేహములును ఎట్టివనుదాని గుఱించి చెప్పవలసిన దంతయు మనుష్యుని విషయముగ చెప్ప దగిన ప్రకరణమున చెప్పబడును. ప్రకృతమున ఆ విష యముగ మనము జ్ఞాపకమున నుంచుకొనదగిన దేమన

గా—వస్తుస్థితిన జీవుడు ఈశ్వరాంశసంభూతు డనునది యథార్థము, అనుభవ సిద్ధము. కావుననే ప్రతిమనుష్యుడును కడపట ఈశ్వరసామ్యమును పొందదగినవాడని దృఢమైన నమ్మిక ముండవలెను.

## II. దేవుని ప్రపంచరచన

7. ప్రపంచగతి జీవునకు హితకరము—ఈశ్వరుని గుఱించి మాట్లాడునపుడు అతని ప్రపంచరచన జనులకు హితకరముగనే యుండునని సూచించితిని. ఇది సామాన్యజనుల మనస్సునకు అంతసమర్పకముగ కనబడనేరదు. నేను బ్రహ్మవిద్యయందలి సారాంశములని చెప్పినవాని లోపల దీనికంటె తెలియుటకు కష్టసాధ్యమైన దేదియు నుండనేరదు. సంసారమున ప్రతిదినము ఎప్పుడును ఎక్కడెక్కడ చూచినను చుట్టుపట్ల ఎంతో శోభను కష్టమును దుఃఖమును వ్యథను జనులు అనుభవించుట మనము చూచుచున్నాము. ఎన్నియో విషయములందు శుభముకంటె అశుభమే హెచ్చుగ నున్నటుల నున్నది. ఇట్లుండ ఇట్టి దుఃఖమయమగు సంసారమును జనుల హితమునకై దేవుడు కల్పించెననుటను

మనస్సు ఒప్పజాలదు. అయినను వాస్తవస్థితియందేమో అది హితకరమే. ఈ బాహ్యప్రపంచమున క్షోభచే లేచియుండు ధూళిపటలమును తప్పించికొని పైన బోయి శాంతిపదమును జ్ఞానస్థానమును చేరి అట్టి ఉన్నత స్థానమునుండి బాహ్యప్రపంచమును చూచినయెడల అపుడు అది వాస్తవమనునది మనకు స్పష్టమగును.

8. ప్రపంచగతియందు అశుభము అల్పము—అపుడు అనేకాంశములుగల ఈ సంసారయంత్రముయొక్క వాస్తవగతి తెలియవచ్చును. అపుడు శుభప్రవాహమునకు ఎదురుగ ప్రవహించి దాని నణగించునటుల కనబడు అశుభ ప్రవాహములన్నియు అల్పస్వల్పములగు సుడులవలె నుండుట తెలియరాగలదు. ప్రవాహమార్గమును వదిలి ఒకక్షణకాలము పల్లములోకి కొంచెము నీరు ప్రవహించవచ్చును. అథవా ప్రవాహముపై సుడులయందు స్వల్పకాలము నీరు వెనుదిరిగి పోవచ్చును. అయినను ఎపుడును నదియొక్క మహాప్రవాహము తాను పోదగు దారిననే పోవుచు పైపైపుట్టు సుడులనుకూడ ముందు సాగించుకొని పోవును. నదివలెనే సంసార మహాప్రవాహమును తనదారియందు సమముగ ముందు ప్రవహిం

చుచునే యుండును. ఎంతో భయంకరమగు తుపానుల వలె కనబడునవన్నియు దాని పై భాగమున గలుగు అల్లాటమే కాని వేఱుకాదు.

9. సంసారకష్టము జీవున కెట్లు హితకరము.—నేను మూడవ మూలతత్త్వార్థముగ చెప్పినట్లు ఈ సంసారమున అందఱకు పరమార్థముగ న్యాయమే లభించును. అన్యాయము ఎన్నడును నడవదు. కావున ఎట్టిస్థితిగతులు ఒక మనుష్యునకు సంభవించినను అవి తాను చేసికొనినవియే కాని వేఱే జనులు సంపాదించి పెట్టినవి కావని అతడు తెలిసికొనును. ఇంతేకాదు. ఇంకొక అంశమును కూడ తెలిసికొనవచ్చును. అదేమనగా—ప్రాణుల పురోభివృద్ధికొఱకే సంసారగతినడవదగునను దైవ విధానముబట్టి, మనుజునకు సంభవించు స్థితిగతులన్నియు, అతని పురోభివృద్ధికి అత్యావశ్యకములగు సుగుణములు అతనియందు ఆవిర్భవించుటకు ఉచితకారణ సామగ్రిగ నున్నవని దృఢముగ నమ్మియుండవచ్చును. అట్టి స్థితిగతులన్నియు మనుజుడు తానై యిష్టపడి కోరినట్టివి యని చెప్పనలవికాదు, కాని అవన్నియు అతని కర్మానుసారముగ అతనికి రాదగినవేకాని వేఱుకాదు. ఇట్లు

పూర్వకర్మానుసారముగ మనుజునకు సంభవించు స్థితి గతులు అప్పుడప్పుడు అతని పురోభివృద్ధికి కుందకము చేయుచున్నవి, అను నీ అంశమును మాత్రము వదిలి మిగత అంశములను చూచినచో ప్రకృతస్థితిగతులే అతని అభివృద్ధికి సాధకములనికనబడు. పూర్వకర్మనుబట్టి అత నికి నానావిధ కష్టములు రావచ్చును. అయినను ఆ కష్ట ముల గలిగించుటలో నొక ఉద్దేశము గలదు. అదేమన గా—కష్టములు వచ్చినపుడు వానిని దాటు క్రమమును తెలిసికొనును. తన్మూలకముగ ధైర్యము, స్థైర్యము, సహనము, పట్టుదల, ఇవే మొదలగు సుగుణములను సంపాదించికొనును. సాధారణముగ, సంసారగతియం తయు మనకు విరోధముచేయుటకే పుట్టినదని జనులు అభిప్రాయపడుదురు. అటుల గాదు. సావధానముగ జనులు చూచినయెడల వస్తుస్థితి గోచరమగును. ప్రతి యొక సందర్భమును, శ్రేయోమార్గమున పైపైకెక్కు టకు సహాయమగునటుల, ఉద్దేశపూర్వకముగ ఏర్పఱచ బడియున్నది.

10. ప్రపంచరచనను మనుజుడు అవశ్యముగ తెలి యదగు—ప్రపంచము భగవంతుడు రచించినదిగాన

ఆ రచనను యత్నపడి తెలిసికొనుట మనుజునకు ఆవశ్యకము. దీనికి కారణముచెప్పుట అనావశ్యకము. స్వార్థమే పురుషార్థమని భావించినను కూడ జనులు ఏవిధానములకు లోబడి తాము జీవించదగునో వానిని తెలిసికొనుట మంచిదిగదా. పరహితమునే ఉద్దేశించువారికేమో అట్టి జ్ఞానము అత్యావశ్యకము. జ్ఞానపూర్వకముగ జేయు సహాయమువల్ల ఫలాతిశయము గలుగును.

11. మానవోత్తముడు ప్రపంచగతియందు సహాయుడు కాదగు—ప్రపంచము మనుజుని అభ్యుదయముకొఱకే రచితమను దానిని తెలియదగినంతట బుద్ధిశక్తిని, ఇతరులకు సహాయము చేయవలెనను నంతటి సౌశీల్యమును, సంపాదించిన తోడనే మనుజుడగువాడు అట్టి ప్రపంచగతియందు వివేకపూర్వకముగ సహాయము చేయవలెననునదికూడ భగవంతుని యుద్దేశమున నొకయంశమను విషయమున ఏమియు సంశయము లేదు. అది యిట్లుండనిమ్ము. భగవంతుడు రచించిన ప్రపంచము వాస్తవముగనే ఆశ్చర్యకరముగను రమణీయముగను ఉండుటబట్టి అట్టి రచనను తెలిసికొనిన వెంటనే మనుజుడు తన యావచ్ఛక్తిని వినియోగించి ఆ రచన

యందు తాను సహాయభూతుడు కాదగు ప్రయత్న మును విడిచి వేఱు ఉద్దేశమును ఎన్నటికి పెట్టుకొన జాలడు. ప్రపంచరచనలో తాను నిర్వహించదగిన అంశము ఎంత స్వల్పమైయుండినను ఆ కార్యముననే ఆసక్తుడుగ నుండును.

---

## నాలుగవ అధ్యాయము

## మనుష్యుడు, అతని దేహములు

1. దేహామే మనుష్యుడు అను అజ్ఞానము—ఈ దేశమున (ఇంగ్లండున) మన నడవడిక యంతయు ఎంత వఱకు దేహాత్మజ్ఞానమును—'దేహామే నేను' అను భావమును—అనుసరించి యుండుటను చూచినచో ఆశ్చర్యమగును. ఇందునకు ఉదాహారణము, మనము ప్రత్యాహము వాడుకొను మాటలకన్న స్పష్టమైనది వేఱొకటి యేదియు నుండనేరదు. "మనుష్యునందు జీవు డున్నాడు," "మన జీవులను అధోగతికి పోకుండు నటుల మనము కాపాడవలెను," అను నీ మాటలు మననోట్లనుండి ఎంతో ధారాళముగ వెడలుచున్నవి కదా. ఇట్టి మాటలు సూచించు అభిప్రాయ మేమనగా —ఈ స్థూల దేహామే వాస్తవ మనుష్యుడు, జీవము అట్టి మనుష్యునకు సంబంధించిన వేఱు పదార్థము, స్థూలదే హాముయొక్క ధర్మము, ఇట్టిదని స్పష్టముగ చెప్పనలవికా

నిది. జీవునివిషయమైన మన వివేకజ్ఞానము ఇంత స్వల్పముగనుండగ, అనేకమంది ఇదేభావనతో మఱియు కొంతదూరము యోచించి, ఇట్టి అస్పష్టమగు జీవుడను పదార్థము వాస్తవముగ నున్నదా లేదా యని సంశయపడుట అంత ఆశ్చర్యముకాదు. ఇందువల్ల దోచు అంశమేమన—సామాన్య మనుష్యునకు తనయందు జీవుడనువాడు కలడా లేడా అనునది ప్రాయశః సంశయాస్పదమైన అంశమే. జీవుడు చావులేనివాడను జ్ఞానమైతేనో అతనికి మొదలే లేదు. అతడు ఇట్టి శోచ్యమగు అజ్ఞానావస్థలో నుండుట ఆశ్చర్యకరమే. ఏలయనగా జీవుని స్వరూపస్థితిని తెలుపు ప్రమాణము బయట మనము చూచులోకముననే ఎంతో చిక్కును. ఆ ప్రమాణమువల్ల దెలియవచ్చు అంశమేమనగా—ఈ దేహమును విడిచికూడ మనుష్యు డుండగలవాడే; ఈ దేహము జీవించియుండగనే దానికి దూరప్రదేశమునను, దేహము మృతమైన తరువాత ఈ దేహమే లేకయు, మనుష్యునకు స్థితిగతులు కలవు అనునది.

2. దేహము మనుష్యున కొక సాధనము—దేహమే మనుష్యుడను మహామోహమునుండి మనలను పూర్తిగ

విడిపించికొనుదాక, ఈ విషయమందలి తత్వాంశములు ఎంతమాత్రము మన బోధకు వచ్చుట సుతరాం అసాధ్యము. కొంచెము విచారించినచో దేహవిషయమైన తత్వము వెంబడె తెలియరాగలదు. అదేమనగా—మనము కను లోకమంతయు ఒకవిధమగు స్థూలభూతముచే నిర్మితముగనున్నది, ఈ స్థూలభూతద్వారముగ మనుష్యుడు తనస్వరూపమును వ్యక్తపరచుకొనుచున్నాడు, మనుష్యుని స్థూలదేహము దానికి దగిన సాధనము, అనునది.

౩. సూక్ష్మభూతములు—ఇంతే కాక ఆ విచారము వల్ల మఱియొక అంశము తెలియనగును. అదేమన—ఇపుడు మనకు గోచరమగు భూతములు గాక సూక్ష్మములగు ఇతర భూతములున్నవనియు తెలియవచ్చును. ఇపుడు మనకు తెలిసియుండు ద్రవ్యములన్నిటియందు లోపలను బైటను వ్యాపించియుండు అతివాయువు (Ether) అను ఒక పదార్థమున్నదని ఇప్పటి భౌతిక శాస్త్రము ఒప్పియున్నది కదా. ఈ అతివాయువు గాక దానిలోపలను వ్యాపించియుండు వేరువిధమగు భూతవిశేషములున్నవి. అతివాయువు ఘనద్రవ్యముకంటె

ఎంత సూక్ష్మమో, ఆభూతవిశేషములు అతివాయువు కంటె అంత సూక్ష్మములు.

4. సూక్ష్మభూతముల దెలియదగు విధము—ఇప్పుడు వాచకుడు సహజముగ ఒక ప్రశ్న నడుగవచ్చును. ఏ మనగా—అంతసూక్ష్మములగు, అంత సూక్ష్మభాగముల గల, భూతవిశేషములున్నవనుటను తెలిసికొనుట మనుష్యునికి ఎట్లు సాధ్యము? ఇందునకు ఉత్తరమేమనగా—స్థూలభూతముల దెలియుటవలెనే సూక్ష్మభూతముల దెలియవచ్చును. భూతముల స్పందములను—చలనములను Vibrations—గ్రహించుటవల్ల గదా ఆభూతములను ఎవడుగాని తెలిసికొనుచున్నాడు. సూక్ష్మభూతములస్పందనములను గ్రహించుటయు అతనికి సాధ్యమే. ఏలయనగా—ఆ సూక్ష్మభూతముల అంశములు ఇతనియందును ఒక అంశముగ చేరియున్నవి. స్థూలభూతమయమగు అతని దేహము స్థూలభూతమయమగు లోకమున విషయములను తెలిసికొనుటకును కార్యభాగములను నడపుటకును ఎట్లు సాధనముగ నున్నదో, అటులనే అతనియందు చేరుకొనియుండు సూక్ష్మభూతములు చేరి అతనికి ఒక సాధనముగ నున్నది. దాని

ద్వారా, స్థూలభూతమయములగు స్థూలేంద్రియములచే కనరాని సూక్ష్మభూతమయమగు లోకమున విషయముల దెలిసికొని కార్యభాగముల నడపుట అతనికి సాధ్యమే.

5. మనుష్యునకు అనేక శరీరములు గలవు—ఇది యొక క్రొత్తమతము ఎన్నటికి గాదు. పాలముని (St. Paul) చెప్పినది జ్ఞప్తికి రావచ్చును. అదేమనగా—ప్రాకృతశరీర మొకటియు చిన్మయశరీర మొకటియు రెండు శరీరములున్నవని వారు చెప్పియున్నారు కదా. మనుష్యునందు జీవుడు (Soul) అనియు చిత్తు (Spirit) అనియు రెండున్నవనియు చెప్పియున్నారు కదా. ఈ రెండును ఒక్కటే పదార్థము పేళ్లని వారు ఎక్కడను సూచింపలేదు. ఇప్పటివారేమో తెలియక ఈ రెండును ఒకటేపదార్థము పేళ్లుగ నున్నటుల ఆ రెండుశబ్దములను ప్రయోగించుచున్నారు. కొంచెము విచారించినయెడల మనము సాధారణముగ తెలిసికొనియుండునటుల గాక మనుష్యునందు భిన్నభిన్నభాగములెన్నియో యున్నవని స్పష్టమగును. జీవుని లోపలనుండు చిదాత్మయే మనుష్యుడు అనునదిగాక, జీవునకే స్థూల-సూక్ష్మ-

సూక్ష్మతరములను తారతమ్యముగల అనేక దేహములు (Vehicles అధిష్ఠానములు) గలవు, ఆ దేహములలో ఈ స్థూలదేహమొకటిది, ఇది ఆ దేహములలోపలనెల్ల అతిక్రిందిది, అను నీ అంశములును స్పష్టమగును. ఈ దేహముల నన్నిటిని ప్రకృతిమండలమందలి లోకము లందు సంచరించుటకు తగిన శరీరములని చెప్పవచ్చును. అనగా—అనేకలోకములు వరుసగ ఒక్కదాని లోపల నొక్కటిది ప్రవేశించి మన చుట్టు నున్నవి, ఈ లోకములలో ప్రతియొక దానియందు నివసించుటకును అందలి పదార్థములను చూచి గ్రహించుటకును తగిన శరీరము ఒక్కొకటిది మనుష్యునకు ఉన్నది అని తాత్పర్యము.

6. శరీరములన్నియు క్రమేణ ఉపయోగమునకు వచ్చును—ఈ అనేక విధములగు శరీరములను ఉపయోగించుకొనదగు విధమును క్రమక్రమముగ మనుష్యుడు నేర్చుకొనును. అందువలన, తాను వసించియుండు వివిధభాగములుగల ఈ లోకముయొక్క స్వరూపమును మఱియు లెస్సగ తెలిసికొనును. ఏలయనగా—ఈ లోపలి లోకాంతరములన్నియు వాస్తవముగ

ఆ లోకమునకు చేరినవియే. ఇవ్విధముగ, పూర్వము అతిగహనముగ కనుపట్టిన అనేక విషయములు అతనికి అవగాహమగును. దేహములే తానను భావమును వదలి వేయును. దేహములు తనకు ఉడుపులువలె కనబడును. వానిని తీసిపెట్టి తిరిగి వేసికొనవచ్చును. వాని స్వరూపమును కూడ మార్చవచ్చును. ఇదంతను తాను ఎట్టి వికారమును చెందకయే నెరవేర్పవచ్చును. ఇదంతను అతడు తెలిసికొనును.

7. ఇదంతయు అనుభవసిద్ధము—ఇక్కడ పూర్వము చెప్పినదానిని మరల చెప్పెదను. ఏమనగా, ఇదంతయు వట్టియుక్తిచే నూహించి చెప్పుమాట కాదు. కేవలభక్తిశ్రద్ధలవల్లను చెప్పుటకాదు. మఱియేమనగా విచారపురస్సరముగ నిర్ణయించిన వస్తుస్థితియే; బ్రహ్మవిద్యా (Theosophy) విచారపరులు పరీక్షించి లెస్సగ తెలిసికొనినది. ఈ విషయములందు కేవల సంభావనామాత్రముగ ఆడుచుండిన వాదమునకు బదులుగ ఇపుడు మేము ఇంత నిర్ణయముగ చెప్పుట అనేకులకు ఆశ్చర్యకరముగ నుండవచ్చును. అయినను విచారకులు మరి మరి బహుకాలము పరీక్షించి సాక్షా

త్తుగ కననిదానినొకటిని ఇక్కడ నేను చెప్పుట లేదు. "మేము చెప్పునదంతయు మేము కనినదే" అను మాట ఇక్కడ వాస్తవముగనున్నది. కేవల శ్రద్ధచే గాదు; పరీక్షించి కనిపెట్టిన దానినే మేము చెప్పుట. కావున దృఢముగనే మేము చెప్పగలము.

8. స్థూల సూక్ష్మ లోకములు—ఈ లోపలి లోకములను, అనగా వివిధములగు ప్రకృతి మండలములను, స్థానములని (Planes) మనము రూఢిచే వాడుచున్నాము. మన యింద్రియములకు గోచరమగు ఈ లోకమును భూస్థానమని (Physical Plane) వాడుచున్నాము. అయితే వాయువులనూ (Gases) వివిధములగు అతివాయువులనూ (Ethers) ఈ స్థానముననే చేర్చియున్నాము. దీనికంటె సూక్ష్మమగు ధాతికమండలమునకు జ్యోతిఃస్థానము (Astral Plane) అను పేరును మధ్యకాలపు తాంత్రికులు (Mediaeval Alchemists) ఇడిరి. వారికి ఈ లోకము గుఱించి బాగుగ తెలిసియుండెను. మేమును ఆ పేరునే పెట్టుకొని యున్నాము. దీనికిలోపల మఱియొక లోకము గలదు. అది మఱి సూక్ష్మతరమగు ప్రకృతిమండలము. దానిని మానస

స్థాన (Mental Plane) మని వాడుచున్నాము. ఏల యనగా మనుష్యునందు మనస్సను ఒక తత్వ మున్నది కదా. తన్మయమగునది ఆలోకము. దీనికిని పైన లోకాంతములు గలవు. కాని వానిపేళ్లను చెప్పి చదువురలకు విసువు పుట్టించుట ఇక్కడ అంత ఆవశ్య కము కాదు. క్రింది లోకములందు మనుష్యుడు ప్రకటిం చుకొను రీతి గుఱించి మాత్రమే ప్రకృతమున మనము విచారము చేయుట.

9. సూక్ష్మలోకములును మనచుట్టుననే యున్న వి—ఎప్పుడును మనము జ్ఞప్తి నుంచుకొనదగు నొక అంశము గలదు. అదేమనగా ఈ లోకములన్నియు మనకు ఏ విధమున గాని దేశతః దూరములు గావు. వస్తుతః కూడ అవన్నియు ఒకే స్థలమును ఆక్రమించు కొని యున్నవి. అన్నియు సమముగ ఎప్పుడును మన లను చుట్టుకొని ఉన్నవి. ప్రకృతక్షణమందు మన చైతన్యము స్థూలమగు మెదడున నిలుకడజెంది దాని ముఖముగనే పనిచేయుచున్నది. కావున స్థూలప్రపంచ జ్ఞానము మాత్రమే మనకు లభించియున్నది. ఆ స్థూల ప్రపంచము కూడ సమగ్రముగ మనకు తెలిసినది

కాదు. అయినను ఆ చైతన్యమును ఈ ఉత్కృష్టశరీరములలో నొకదానియందు ఏకాగ్రముగ నిలుపుటకు మాత్రము నేర్చుకొనినయెడల వెంటనే స్థూలప్రపంచము మనకు అదృశ్యమై దానికి బదులుగ మనము ఉపయోగించిన సూక్ష్మదేహమునకు సంబంధపడిన సూక్ష్మలోకమును మనము కనుదుము.

10. ఒకే వస్తువు నానాభూతములుగ నున్నది—ప్రకృతమండలమంతయు సారాంశమున ఒకేవస్తువు అనుదానిని జ్ఞప్తియం దుంచుకొనదగును. మంచుగడ్డయు ఆవిరియు స్వరూపమున ఒకేవస్తువు గదా. ఆలాగుననే స్థూలభూతమును సూక్ష్మభూతమును స్వరూపమున ఒకే వస్తువు. ఒకేవస్తువు ఒక అవస్థను వదలి మఱియొక అవస్థయందున్నది, అంతే కదా. స్థూలభూతము (Physical Matter) జ్యోతిర్మయభూతము (Astral Matter) కావచ్చును. ఆ జ్యోతిర్మయభూతము మానసతత్వము (Mental Matter) కావచ్చును. దీనికి గావలసిన దేమనగా—స్థూలభూతమును అతిసూక్ష్మముగ విభాగించి తగువేగముతో చలించునటుల చేయవలెను, అంతే.

## మనుష్యుని నిజస్వరూపము

11. మనుష్యుడు ఈశ్వరాంశభూతుడు—అయితే మనుష్యుడు స్వతః ఎట్టివాడు ? అనగా, ఈశ్వరునినుండి వెడలివచ్చిన ఈశ్వరుని అంశమే మనుష్యుడు. దేవుడను అగ్నియొక్క కణమగు, మనుష్యుడుగనుండు, ప్రత్యగాత్మ సాక్షాత్ దేవస్వరూపుడే. అతనిలోని జీవము ఆప్రత్యగాత్మకు ఒక కోశముగ నున్నది. జీవము ప్రత్యగాత్మను ఆవరించి "నేను" అను భావమును అతనికి పుట్టించి ఆ ప్రత్యగాత్మయు మిగత ఈశ్వరాంశములును పరస్పర భిన్నములని మన అల్పజ్ఞానమునకు కొంతకాలము తోపించును. మనుష్యునందలి జీవము ఆదియందు ఎటుల నేర్పడినదియును ప్రత్యగాత్మను తనలో నెటుల చేర్చుకొనినదియును, ఈ కథ అతి రమణీయమై మనోహరమై యుండును. కాని అది అతి విపులమైనది కావున చిన్నప్రకరణరూపమగు ఈ గ్రంథమున దానిని వివరింప సాధ్యము కాదు. ఈ సిద్ధాంతభాగమును గుఱించి నేను వ్రాసియుండు గ్రంథాంతరములను జూచి ఆ విషయమును సమగ్రముగ తెలిసికొనవచ్చును. అందున ఇక్కడ చెప్పవలసిన

అంశ మేమనగా—ఈశ్వరుని మూడు (బ్రహ్మ-విష్ణు-శివ-అను) అంశములు చేరుటవల్లనే జీవబీజము ఉత్పన్నమైనదనునది. జీవస్వరూపనిష్పత్తి యనునది ఈశ్వర కృత మహాయజ్ఞముయొక్క ఫలితాంశము. ఈశ్వరమహాయజ్ఞమనగా, అతడు ప్రకృతిమండలములోకి దిగివచ్చుటయే. ఇదే అవతారమనునది.

12. మనుష్యుని శరీరముల పెంపు—జీవశిశువుయొక్క ఉత్పత్తి యిట్టిది. జీవుడు ఈశ్వరుని ప్రతిబింబరూపముగనే సృజింపబడియున్నాడు. అనగా, ఈశ్వరునివలె అంశత్రయముగలవాడు, ఈశ్వరునివలెనే మూడువిధములుగ ప్రకాశముగొనును. జీవుని పెంపును కూడ ఈశ్వరుడు ప్రకృతిమండలములోకి దిగునటులనే యుండును. ప్రత్యగాత్మయను చిదగ్నికణమున సకలశక్తియు గలదు. కాని అనేక కల్పముల కాలము పెరిగిననే ఆ శక్తులన్నియు ఆవిర్భవించును. మనుష్యునందు బీజరూపముగనుండు గుణములు ఆవిర్భవించురీతి యెట్లనగా,—మొదలు బయట పదార్థములు చలించును. ఆ చలనములు మనుష్యునిపై ఏటులుగ పడును. అపుడు ఆ ఏటులకు దగురీతిన అతడును చలించుటకు క్రమేణ

నేర్చుకొనును. ఇపుడు మనుష్యుడు ఎక్కియుండు అంతస్తున, అనగా విజ్ఞానమయమగు మానసలోకమునందు, బయటనుండి వచ్చు స్పందములు అతిసూక్ష్మములు కావున ప్రకృతమున మనుష్యుని అల్లాడించి లేపజాలవు. కాబట్టి మొదలు మోటయి బలవంతములైన స్పందములందు అతడు ప్రారంభించవలెను. వానిచే లీనముగ నుండు గ్రహణశక్తులను లేపిన తరువాత క్రమేణ అతని గ్రహణశక్తి హెచ్చి కడాన అన్నిలోకములందును ఎన్నెన్ని విధములగు స్పందములున్నవో వాటినెల్లటిని పూర్తిగ గ్రహింప శక్తి లభించును.

13. అంతరాత్ముని వృద్ధి—భౌతికశరీరములందు కనుపట్టు మనుష్యుని పెంపు ఇట్టిది. ఇపుడు ప్రత్యగాత్మతట్టు చూతము. ప్రత్యగాత్ముడు స్పందములన్నిటిని గ్రహించుటయనగా మైత్రి కరుణాదిభావములు పూర్తిగ నుండుట. ఇట్టి స్థితికి వచ్చినవాడే సిద్ధపురుషుడు, మహాయోగి, ఆత్మవిద్యాగురువు, పూర్ణాభిషిక్తుడు. సిద్ధపురుషుని లక్షణమగు గుణగణము మనుష్యునందు ప్రకాశముగొనిననే ఇట్టి స్థితి సిద్ధించుట. ఇదియే ప్రకృతిమండలమున దీర్ఘకాలము వసించి సాధింపదగు కార్యము.

14. ఇది సంగ్రహము—ఈ అధ్యాయమున అతి ముఖ్యమగు అనేకవిషయములను పైపైన ముట్టి కనుపఱిచితిని. వాని గురించి ఇంకను హెచ్చుగ తెలిసికొననిచ్ఛగలవారి సహాయార్థమై వ్రాసిన పుస్తకములనేకములు గలవు. వాని జదివి తెలిసికొనవచ్చును.

---

## ఐదవ అధ్యాయము

### పునర్జన్మము

1. జన్మమును దాని ఫలమును—అతిసూక్ష్మచలనములవల్ల జీవునందు ఎట్టి వికారము మొదట పుట్టనేరదు. కాబట్టి మందముగ చలించు స్థూలభూతమయ దేహములచే జీవుడు తన్ను ఆవరించుకొనవలసియున్నది. ఇందువలన క్రమక్రమముగ మొదట మానసశరీరమునూ, అనంతరము జ్యోతిర్మయ (Astral) శరీరమునూ, అనంతరము స్థూలశరీరమునూ పరిగ్రహించును. ఇదే జన్మమనునది, దేహవంతుడగుట, స్థూలదేహమున జీవించుటకు ప్రారంభము. ఇట్టి జన్మమున జీవునకు స్థూలదేహమూలకముగ వివిధములగు అన్ని అనుభవములు కలుగును. వాని ద్వారముగ జీవుడు కొన్ని పాఠముల నేర్చుకొని తనయందు కొన్ని గుణవిశేషములను సాధించుకొనదగును.

2. మరణమును పునర్జన్మమును—ఇట్లు కొంతకాలము వర్తించి తరువాత జీవుడు వెనుదిరిగి తనయందే

యుండుటకు యత్నించును. అపుడు తాను పరిగ్రహిం
చిన దేహములను క్రమముగ ఒక్కొకటిగ తీసివేయును.
వానిలో మొదట పడిపోవునది స్థూలదేహము. జీవుడు
ఆ దేహమును విడిచిపోవుదానినే మనము మరణమనునది.
అంతలో జీవుని చేష్టలన్నియు సమాప్తిచెందినవని అతి
అజ్ఞానులగు కొందరు భావించుటకలదు. జీవునిచేష్ట అప్ప
టికి సమాప్తమగుట లేదు. అట్టి భావనకంటె అవాస్త
వమైనదేదియు లేదు. జీవుడు ఈ యొకసారి ప్రయత్నము
చేసి వెనుదిరుగును; అంతే. ఆప్రయత్నముచే సాధిం
చిన ఫలితాంశమును తన వెంటపెట్టుకొనియే పోవును.
తరువాత కొంతకాలము విశ్రమించినట్లుచేసి అదేవిధ
మగు మరియొక ప్రయత్నముచేయును.

౮. పునర్జన్మ ఉద్దేశము—ఇట్లు, మనము సాధారణ
ముగ మనుష్యుని జీవితకాలమనునది అతని వాస్తవమగు
అతిదీర్ఘమగు జీవితకాలమున ఒకదినమాత్రమువలె
నుండును. అటులని కొందరు చెప్పియే ఉన్నారు. అది
కొన్ని పాఠముల నేర్చుకొనుటకై పాఠశాలకు ఒక
దినము పోవునట్టిది. అయితే ఒక జన్మమున ౭౦ అథవా
౮౦ వర్షములకాలముకంటె హెచ్చుగ జీవించియుం

డుట లేదు. అట్టి స్వల్పకాలమున ఈ అద్భుతమగు సుందరమగు లోకమున నేర్చుకొనదగు పాఠములనన్నిటిని నేర్చుటకు అవకాశము అతనికి లభించనేరదు. ఇదిగాక దేవుడు జీవునకు కావలసినంతకాలము నిచ్చి సావకాశముగ పాఠముల నేర్చుకొనుగాక యనియే ఉద్దేశించియున్నాడు. కావున పాఠములనన్నిటిని నేర్చుకొనువరకు మరల మరల వెనుకకు పలుమార్లు వచ్చి అనేకజన్మములకాలము, అనగా అనేక పాఠదినములు, ఈ లోకమున పలు తెరంగులగు సందర్భములందును జీవించవలసియున్నది. అంత ఈక్రిందిపాఠశాలకార్యము ముగియగా, జీవుడు ఇంకను ఉత్కృష్టమగు అతివిభవయుక్తమగు కార్యము సలుపుటకై పైకిపోవును. ఇదే జీవుడు జీవించి చేయదగు సాక్షాత్ భగవంతుని కార్యము. దీనిజేయను అర్హతను సంపాదించుటకే భూలోకమున జనించి పాఠముల నేర్చుట.

4. పునర్జన్మసిద్ధాంతము ఆదరణీయము—ఇదే పునర్జన్మసిద్ధాంత మనునది. ఈ సిద్ధాంతము విద్యాసంస్కారముగల ప్రాచీన జనపదములందంతట సుప్రసిద్ధమయినదే. ఇప్పుడును మానవకోటియందు ఈ సిద్ధాంతమున

నమ్మువారే హెచ్చుజనము. దీని గుఱించి హ్యూమ్ (Hume) అను వారు వ్రాసియుండునదేమనగా—

"ఏది చెడదగునది కాదో అది పుట్టదగునదియు కానేరదు. కావున జీవుడు మరణరహితుడైనచో మన జన్మమునకు పూర్వము అతను ఉండియే యుండవలెను. . . . కావున ఇట్టి మతములపైకి పునర్జన్మపతమొకటే తత్వవిచారకుడు లాలించదగు మతము."

ఇండియా - గ్రీసు దేశములలో ప్రచారమందుండిన పునర్జన్మమతములను గుఱించి వ్రాయునపుడు మోక్షమూలార్యుడు (Max Muller) చెప్పినదేమనిగా—

"ఆమతములకెల్ల ఆధారభూతమగునది ఒక అంశము కలదు. దానిని కల్పితాంశముల నన్నిటిని వదిలి చెప్పినచో, ఎంతో ఖచితముగ పరీక్షించిచూచినను అది నిలువదగు అంశమే".

ఈ ప్రాచ్యగ్రంథవిమర్శకుడే కడపట వ్రాసిపెట్టి, అతడు మృతినొందిన తరువాత ప్రచురింపబడిన ఒక గ్రంథమందును ఈ సిద్ధాంతమును ఉదాహరించి అందున తన స్వంత నమ్మకమును వ్యక్తపరిచి యున్నాడు.

హక్స్లీ (Huxley) యనువారు ఇట్లు వ్రాసియున్నారు —“ పరిణామ (Evolution) సిద్ధాంతమెట్లో అట్లే పునర్జన్మసిద్ధాంతమును వస్తుతత్త్వస్థితిని ఆధారము చేసికొనియే నిలిచియున్నది. సాదృశ్య (ఉపమాన Analogy) ప్రమాణబలమును ఆశ్రయించి దానిని సాధింపనగును.”

ఇట్లు ప్రాచీన నవీన గ్రంథకర్తలు ఉభయులును ఈ పునర్జన్మపక్షమును అత్యాదరముతో విచారము చేయదగినదని పరిగ్రహించియున్నారు.

5. ఈ సిద్ధాంతముయొక్క ఆభాసరూపము—అజ్ఞులు కొందరు ఈ పునర్జన్మవిషయమున పెట్టుకొనియుండు మతముతో ఈ మతమును చేర్చదగదు. ఆ అజ్ఞులు చెప్పునదేమనగా, జీవుడు పెరిగి క్రమేణ మనుష్యత్వదశను పొందినపైనను తిరిగి వెనుదిరిగి క్షుద్ర జంతువుగ పుట్టుసంభవము కలదని. ఇట్లు వెనుదిరుగుట ఎన్నటికి సంభవింపనేరదు. ఒకసారి మనుష్యపదవికి వచ్చిచేరినపైన—అనగా, మనగ్రంథములందు కారణశరీర (Causal body) మని మనమువాడు దేహమున వసించు మనుష్యజీవుడైన పిదప—అతడు ఎట్టి తప్పులే చేయని, అతనికి ఒదవియుండు సౌకర్యములను ఎంతో

ఉపేక్షించి పోగొట్టుకొనని, అతడు వాస్తవముగ క్రింది జంతువర్గమున పుట్టనేరడు. సంసారమను పాఠశాలయందు అతడు ఒకవేళ సోమరిగనుండినచో లెస్సగ నేర్చువరకు ఒకేపాఠమును మరి మరి అభ్యాసముచేయవలసివచ్చును. అంతేకాని ఒట్టున క్రమముగ ముందుకేపోవును. అట్టివాడు ప్రాయికముగ మెల్లగ పోవచ్చును; అంతే.

6. ఈ సిద్ధాంతముయొక్క లలితమగు నొకవర్ణన— కొన్ని వర్షములక్రిందట ఒక పత్రికయందు ఈ సిద్ధాంతముయొక్క సారాంశము లలితమైన రీతిన వర్ణింపబడె. ఎట్లనగా—

"ఒక బాలుడు బడికి పోయెను. అతడు మిక్కిలి పిన్నవాడుగనుండె. అతనికి తెలిసినదంతయు తల్లిపాలును త్రాగునపుడెంత తెలిసికొనెనో అంతే. అతని ఉపాధ్యాయుడెవడనగా, భగవంతుడే. ఆ ఉపాధ్యాయుడు ఆపిల్లకాయను అతిక్రిందివర్గమున చేర్చి అచ్చట నేర్చుటకై చెప్పియిచ్చిన పాఠము లేవనగా— 'నీవు చంపకూడదు, ఏప్రాణిని నొప్పింపకుము, దొంగిలించకుము,' అని. అట్లే చంపుటను వదిలెనుకాని, హింసించుటను దొంగిలించుటను వదలలేదు. పగలు తీరిపోయినది.

వానిగడ్డము తెల్లపడెను. రాత్రియు వచ్చెను. అంత ఉపాధ్యాయుడగు భగవంతుడు అతని జూచి, 'చంపుటను వదలుటకు నీవు నేర్చుకొనినైయైనది. కాని మిగత పాఠములను నేర్చలేదు. రేపు తిరిగి రా' అని చెప్పెను.

"మరునాడును చిన్నపిల్లకాయగనే మరల వచ్చెను. అప్పుడు ఉపాధ్యాయుడగు భగవంతుడు అతనిని కొంచెము పైనివర్గమునకు చేర్చి నేర్చదగు పాఠములను ఇట్లు చెప్పెను—'ఏ ప్రాణిని నొప్పింపకుము, దొంగిలింపకుము, మోసము చేయకుము.' అట్లే ప్రాణులను నొప్పించుట వదిలెను. అయినను దొంగతనమును మోసమును వదలడాయె. పగలు ముగిసె. అతనిగడ్డము తెల్లనాయె. రాత్రి వచ్చె. ఉపాధ్యాయుడగు భగవంతుడు చెప్పెగదా—'నీవు కారుణ్యమును నేర్చితివి, కాని మిగత పాఠములను నేర్చలేదే. రేపు రా,' అని.

"మరల మూడవదినమున పిన్నపిల్లకాయగనే వచ్చెను. అంత ఉపాధ్యాయుడగు భగవంతుడు ఇకరవంత పైవర్గమున చేర్చి అచ్చట నేర్చదగిన పాఠముల నిట్లు చెప్పె—'దొంగిలింప వలదు, మోసము చేయవలదు, దురాశ పడవలదు,' అని. అట్లే దొంగిలించుటను వది

లెను, కాని మోసము చేయుటను దురాశ పడుటను వదల లేదు. ఆదినమాయె. అతనిగడ్డము తెల్లపడె. రాత్రియు వచ్చె. ఉపాధ్యాయుడగు భగవంతుడు, 'నీవు దొంగి లించుటను వదలుటకు నేర్చుకొనినదాయె. అయినను మిగత పాఠములను నేర్చలేదే. వత్సా! రేపు మరల రా,' అని చెప్పెను.

"దీనినే స్త్రీపురుషుల ముఖమునూ, ఈ ప్రపంచ మను పుస్తకమునూ, నక్షత్రరూపముగ వ్రాసిపెట్టి యుండు ఆకాశమను పత్రికనూ, చూచి చదివి తెలిసి కొనినది."

7. ఈసిద్ధాంతము సంశయనివర్తకము—ఈపునర్జన్మ సిద్ధాంతమునకు సాధకమగు యుక్తులు అభేద్యములగునవి అనేకములు గలవు. వానినన్నిటిని చెప్పి ఈ పుస్తకమును నిండించుట సరికాదు. నాకంటె ఎంతోసమర్థులగు వారు ఆయుక్తులనన్నిటిని మహాగ్రంథములందు అతి విస్తరముగ వివరించియున్నారు. ఇక్కడ నేను చెప్పు నది ఇంతమాత్రమె. ఏమనగ—ఈసంసారస్థితియందు సంశయాస్పదమగు అనేక అంశములు మనకు కనుపట్టు చున్నవి. వాటిని ఈపునర్జన్మసిద్ధాంతము తప్ప వేఱు

మార్గమున సమర్థించుట సుతరాం అసాధ్యముగనే కన బడును. ఈసిద్ధాంతము పెట్టుకొనినవారికి ఆ అంశములు ఉపపన్నముగ కనబడుట యేమో నిశ్చయము. కాబట్టి ఇకమఱియు తృప్తికరముగ ఆ సంశయముల నిర్ణ యింపదగు వేఱొకపక్షము దొరకువఱకు ఈపక్షము నిలిచియుండదగినదే. ఈ శాస్త్రమందలి ఇతర సిద్ధాం తాంశములవలెనే ఈసిద్ధాంతాంశముకూడ కేవల యుక్తి సిద్ధమేకాదు; పరంతు మాలో అనేకులకు సాక్షాత్తుగ ప్రత్యక్షానుభవసిద్ధమగు విషయము. కాని మా అను భవము ఇతరులకు ఋజువుకానేరదనునది సహజమే.

8. దీనివిచారము ఆవశ్యకము—అయినను సత్పురు షులును సత్యసంధులునగు కొందరు—ప్రపంచమున మన చుట్టుముట్టునందలి స్థితిగతులకును, దేవుడు సర్వ శక్తుడే కాక సర్వప్రియుడును కూడ అను సిద్ధాంతమున కును, పరస్పరానుగుణ్యము లేదని అంగీకరించవలసి యుం డుటకై—ఎంతో పశ్చాత్తాపపడువారై యున్నారు. హృదయమును వ్రక్కలించు దుఃఖసంతాపములజూచి వారు చెప్పునదేమనగా—దేవుడు సర్వశక్తుడు కాడు, కావుననే దుఃఖసంతాపములను నివారింపలేకయున్నాడు.

అథవా, సర్వశక్తుడే దేవుడు, కాని సర్వప్రియుడు కాడు, కావుననే ప్రాణులు దుఃఖపడుచున్నారను చింత అతనికి లేదు. బ్రహ్మజ్ఞాన (Theosophy) దృష్టితో జూచు మనకు, ఈశ్వరుడు సర్వశక్తుడును సర్వప్రియుడును అవును అను దృఢనిశ్చయము కలదు. ఇట్టి సిద్ధాంతమునకును సంసారమందలి ప్రకృతస్థితులకును పరస్పరానుగుణ్యమున్నదనుదానిని ఈపునర్జన్మసిద్ధాంతము బట్టియే చూపగలము. దేవునిశక్తియు ప్రీతియు పూర్ణమను దానిని యుక్తియుక్తముగ మనము తెలిసికొనునట్లు చూపునది ఈపునర్జన్మపక్షమొకటే కావున దానిని మనము సావధానముగ పరీక్షింపదగినది సుమీ!

9. మన పూర్వకర్మఫలములే ఇప్పటి కష్టసుఖములు—ఇప్పటి మన జన్మము మొదటిదికాదనియు, మనలో ఒక్కొకరికిని వెనుక అనేక జన్మపరంపరయున్నదనియు ఈసిద్ధాంతము మనకు చెప్పుచున్నది. ఈ వెనుకటి జన్మములందలి అనుభవమూలకముగనే మనము ఆదియందలి మూఢత్వదశనుండి క్రమముగ చైతన్యవికాసముబొంది ఇప్పటి ఉచ్చస్థితికి వచ్చియుండుట. ఈ వెనుకటి జన్మములందు సుకృతదుష్కృతముల రెంటిని

చేసియున్నామనుననదేమో నిశ్చయము. కార్యకారణ నియమము అప్రతిహతము కావున మనము చేసిన ప్రతి యొకకార్యమునుండి తగినంతఫలము సంభవించియే తీరును. సుకృతమువల్ల సుఖమును, ముందు సుకృతము చేయ హెచ్చు సందర్భసౌకర్యములును, నియతముగ లభించును. దుష్కృతము వల్ల దుఃఖమును ముందు ప్రతిబంధమును నియతముగ కలుగును.

10. అందరును అభ్యుదయమార్గముననే యున్నారు—ఆకారణముచే ఎవ్విధముగ ప్రతిబంధము సంభవించినను అది మనము చేసికొనినదే. అథవా జీవచైతన్యవికాసము ఇకను ఆరంభదశయందే యున్నందున అట్లుండవచ్చును. మనము దుఃఖతాపముల ననుభవింపవలయునేని దానికి మనమే కారణభూతులము. మనుష్యులందు నానారూపమగు చిత్రవిచిత్రమగు స్థితిగతులు అగపడుచున్నవికదా. అవి వారువారు పూర్వముచేసిన సుకృతదుష్కృతముల తారతమ్యానుసారముగ వారి వారికి తగినట్లు అతిఖచితముగ ఏర్పడియున్నవి. సర్వము దేవుని నియమానుసారముగ కడాన పరిపూర్ణవిభవము ననే పరిణామమగుటకు ముందుతట్టే నడచుచున్నది.

11. పునర్జన్మసిద్ధాంతము మనస్సమాధానకరము— బ్రహ్మవిద్యా (Theosophy) సిద్ధాంతతత్వములలో ఈ పునర్జన్మమహాతత్వముకంటె అధికముగ ఆక్షేపింపబడున దేదియు ప్రాయశః ఉండనేరదు. అయినను వాస్తవ మందు దీనికంటె హెచ్చుగ మనస్సమాధానముచేయు తత్వాంశమేదియు లేదు. ఈ సిద్ధాంతరీత్యా మనకు ప్రాప్యమగు అభ్యుదయమును పొందుటకు కావలసినంత కాలముకలదు. అనగా పరమేష్ఠియగు మన తండ్రియగు ఈశ్వరుడు పరిపూర్ణుడుగనుండునట్లు మనమును పరిపూర్ణులమగుటకు కావలసినంత కాలమును సందర్భమును మనకు లభించును. ఆక్షేపకులు ముఖ్యముగ ఆక్షేపించుట ఏమనగా— "ఈజన్మముననే ఎన్నియో కష్టదుఃఖముల ననుభవించినదాయెను. దానినంతను తిరిగి అనుభవించవలెనని మేము వినజాలము" అని చెప్పుదురు. అయితే ఇట్లు చెప్పుట న్యాయము కాదనునది స్పష్టము కదా. మనము తత్వాంశమును కనిపెట్టవలెనని యున్నాము. తత్వము లభించెనేని అది ప్రియమైనను అప్రియమైనను దానినివదిలి వెనుదీయకూడదు. అయితే వాస్తవముననేమో వెనుక చెప్పినటుల పునర్జన్మ

సిద్ధాంతమును సరిగా తెలిసికొనినచో దానిచే అచంచలమగు మనస్సమాధానము కలుగును.

12. జన్మాంతరజ్ఞానమేలలేదు, ఎట్లు కలుగును ?— ఇదిగాక జనులు పదేపదే అడుగు ప్రశ్నయొకటికలదు. అదేమన, "మనము వెనుక అన్ని అనేక జన్మములెత్తియుంటిమేని వానిపైకి ఒకపైనను మనజ్ఞప్తికి వచ్చుటలేదు కదా. అదియేల ?" దీనికి అతిసంగ్రహముగ ఉత్తరము చెప్పెదను. కొంతమందికి ఆ పూర్వజన్మముల జ్ఞానము ఉండియే యున్నది. సామాన్యముగ జనులకు జ్ఞప్తిలేకపోవుటకు కారణమేమనగా, వారి జ్ఞానమంతయు క్రింది దేహములలో నేదోయొక దాని యందు స్థిరముగ నిలిచియుండును. ఈ క్రింది దేహము వెనుకటి జన్మముల స్మరించు సంభవములేదు. ఏలయనగా, ఆ దేహమునకు వెనుకటి జన్మములేదు. వెనుకటి జన్మములగలవాడు జీవుడు. జీవునకేమో తనలోకము యొక్క జ్ఞానము ఇకను పూర్తిగ రూఢిపడలేదు. అయినను గతజన్మముల జ్ఞప్తియంతయు జీవుని లోపల నిక్షిప్తమై యున్నది. ఆ జ్ఞప్తియే శిశువు పుట్టినపుడు దాని నైజగుణములుగ కనుపట్టును. ఎప్పుడైతే మనుష్యుడు

బాగుగపెరిగి తనజ్ఞానమును క్రింది దేహములందు మాత్రమేకాక జీవుని స్వరూపమునందు కూడ స్థిరముగ నిలుపుటకు సమర్థుడగునో అప్పుడు జీవుని నైజమగు అతి విస్తారమగు జీవితచరిత్రమంతయు అతనికెదుట ఒక పుస్తకమువలె తెరువబడును.

13. ఈ సిద్ధాంతమును విస్తారముగ వివరించు గ్రంథములు—అనిబెసెంటమ్మగారు మొదలగువారు వ్రాసియుండు కొన్ని పుస్తకములందు ఈవిషయము సమగ్రముగ మనోహరముగ వివరించబడియున్నది. విచారకుడు అవశ్యముగ ఆ పుస్తకముల జదువవగు.

---

# ఆఱవ అధ్యాయము

## విశాలదృష్టి

1. పాఠము నేర్చుటయే ఇహ జన్మప్రయోజనము—మనుష్యుడు స్థూలదేహమున జీవించుట పాఠశాలయందు ఒకదినము పాఠమునేర్చుటవలెనే కాని వేఱుకాదు ; అతడు పాఠము నేర్చుటకు తగిన సాధనముగ కొంతకాలము మాత్రము వేసికొనిన కేవలము ఒక ఉడుపువంటిది ఈ స్థూలదేహము ;—అను నీ తత్త్వములను నిస్సంశయముగ తెలిసికొనినవాని ఆచరణ ఎట్లు సమూలముగ మారిపోవునో ఆ విషయము మనకు, కొంచెము ఆలోచించినచో, శీఘ్రముగనే తెలియరాగలదు. పాఠమునేర్చుట యను నీ యొక యుద్దేశమే ప్రయోజనకారి యని వెంటనే అతనికి తోచును. ఇక నేకారణమువల్లగాని ఈ యుద్దేశము వదిలి ప్రయోజనాంతరము నపేక్షించి నడచునతడు అచింత్యమగు మౌఢ్యమువలన నారీతిన వర్తించువాడని యతనికి తోచును.

2. జ్ఞాననిష్ఠుడు పైననే చూచును.—కేవల స్థూల విషయాసక్తుడును యశఃకాంక్షియు ధనార్జనాసక్తుడునగు పామరమనుష్యుని జీవితము తత్వవిత్తుని దృష్టియందు కేవల బాలక్రీడయే. ఏలయనగా, అట్టివాడు తన నికృష్ట స్వభావమును క్షణకాలము తృప్తిపరచుటకుగాను నిజముగ తాను సంపాదించి సేకరించి యుంచుకొనదగు వాటినంత మాధ్యముచే వదిలివేసినవాడగును. జ్ఞాననిష్ఠుడు ఉత్కృష్టవస్తువులను వలచును. నికృష్ట వస్తువులప్రక్క తిరుగుటయే లేదు. ఇందుకు కారణము—అదే సన్మార్గమని అతడు గ్రహించియుండుట మాత్రము కాదు. ఇదిగాక, భూలోకమందలి యీ నికృష్టపదార్థములు అప్రయోజకము లనునదియూ కూడ స్పష్టముగ అతని యనుభవమునకు వచ్చియుండును. అతడెపుడును ఉత్కృష్ట దృష్టితోనే చూడ యత్నించును. ఏలయనగా, నికృష్ట దృష్టి నుత్తరాం నమ్మదగనిదని అతడు గ్రహించియుండువాడు. అనగా, నికృష్టమగు భావసంకల్పములు మంచువలె తనను ఆవరించుకొనుటచే, నికృష్టదృష్టితో చూచునపుడు దేనిని స్పష్టముగ చూచుటకు తనకు సాధ్యము కాదనుటను అతడు గ్రహించియుండును.

3. జ్ఞాననిష్ఠుని ఆంతర స్పర్ధ—అయినను, సైద్ధృష్టి తో నడచుటయే ఎప్పుడును సరియైనదని పూర్ణముగ నమ్మియుండినను, ఆ దారినే యనుసరించవలెనని నిర్ణయించికొని యుండినను, కొన్ని వేళలందు క్రిందిదారికి నీడ్చు బలీయమగు సంకల్పములు అతనికి సంభవించును. అపుడు తనలోపల గొప్ప స్పర్ధకలుగుటను చూచును. అపుడు పౌలముని (St. Paul) చెప్పి యుండు నట్లు « మనస్సంకల్పమునకు విరుద్ధముగ అవయవ సంకల్పములు ” కలుగును. అట్టి విరోధముచే « నాకిష్టమగు దానిని నేను చేయుట లేదు, నాకిష్టము కాని దానిని నేను చేయుచున్నాను ” అనునదియు జ్ఞాననిష్ఠునకు తెలియరాగలదు.

4. ఈ స్పర్ధవిషయమగు దురభిప్రాయములు— హెచ్చుతక్కువగ మన మందరము అనుభవించి యుండు ఈ ఆంతర కలహ విషయమున దైవభక్తిగల అనేకులు సత్పురుషులు అత్యనర్థకరమగు దురభిప్రాయము గలిగియున్నారు. వారు ఈ విషయమున సామాన్యముగ రెంటిలో నొక సిద్ధాంతమును అంగీకరించి యున్నారు—(1) లోపలి ఈ దుష్టసంకల్పములు

బయటనుండు పిశాచముల ప్రేరణవల్ల గలుగునవని కొందరు నమ్మియున్నారు; (2) అథవా, కొందరు అట్టి అగాధదోషములు ఇకను తమ లోపల నుండుటబట్టి తమ హృదయములు అతి పాపిష్ఠములై కల్మషములై యుండవలెనని చింతించి మిక్కిలి వ్యసనపడుదురు. వాస్తవమున స్త్రీపురుషులలో అనేకులు ఉత్తమోత్తములు ఈ విషయమున మిక్కిలి అనావశ్యకముగ ఎంతో వ్యథపడుచున్నారు.

5. దుష్టసంకల్పముల మూలము పిశాచములూ కావు, ఆత్మయూ కాదు—ఈ విషయము అవగాహనకు రావలెనని ఒక అంశమును స్పష్టముగ మనస్సున నుంచవలెను. అదేమనగా, ఈ నికృష్ట సంకల్పము వాస్తవముగ మన సంకల్పము ఎప్పటికి కాదు. అథవా, ఏదో యొక పిశాచము మన జీవములను నాశము చేయవలెనని యుద్దేశించి చేయు పనియూ కాదు. మనుష్యుని దుస్స్వభావము ఆకర్షించు పాపిష్ఠభూతములు కొన్ని వేళల నున్నవనునదియూ, వాని చేష్టవల్ల ఆ దుస్స్వభావముయొక్క బలము హెచ్చు ననునదియూ నిశ్చయమే. అయితే, ఆభూతములన్నియూ మను

ష్యుడు సృష్టిచేసినవి, అనిత్యములైనవి. అవి ఇతర దుష్ట మనుష్యుల మనోభావమునుండి యుత్పన్నమై కేవల కల్పిత రూపము లగుటవలన వాటిని పుట్టించిన మనోభావముయొక్క బలమెంతో అంతకాలము ప్రాణుల వలె జీవించులాగున అగపడును.

6. క్రింది దేహములే వానిమూలము—అయినను సాధారణముగ మనలోపలి దుష్టప్రేరణ, వేఱు మఱి యొక ప్రక్కనుండి వచ్చును. అదెట్లనగా, మనుష్యుడు ఇక్కడ జన్మమెత్తుటకై అనేక లోకముల భూతాంశములచే కోశముల నిర్మించి పైన వేసికొనునని చెప్పితిని కదా. ఇట్టి భూతము నిర్జీవము కాదు; జీవపూరితమైనది. నిర్జీవభూతమనునది ఎక్కడను లేదనే గుహ్యవిద్య చెప్పునది. అయితే ఈ భూతముననుండు జీవుని చైతన్యవికాసము మనకంటె ఎంతో క్రింది స్థితియందుండును. అది ఇకను పైనుండి క్రిందిలోకముల తట్టు పోవుటయందే యున్నది. మనమేమో క్రిందిలోకముల నుండి తిరిగి పైలోకముల తట్టు పోవుచున్నాము. ఈ విధముగ ఆ భూతజీవము ఎంతో హీనస్థితియందున్నది. కాబట్టి ఎప్పుడును క్రిందుగ స్థూలలోకముల తట్టుననే

తిరుగుటయు అక్కడి స్థూలస్పందముల ననుభవించుట యు దాని స్వభావముగ నుండును. ఇందువలన దానికి అభ్యుదయము కలిగినను మనము భ్రష్టులగుదుము. కాబట్టి కొన్ని వేళలలో మానవుని నిజమైన అభ్యుదయ మును, అతని కొన్ని శరీరములందలి భూతాంశముల అభ్యు దయమును, పరస్పరము ప్రతికూలముగ పరిణమించును.

7. క్రింది శరీరములను వశపఱచుకొన వలయు.— ఇదే మనము కొన్ని వేళలలో అనుభవించు ఒకవిధమైన ఆంతరస్పర్ధయొక్క వివరము, ఇక్కడ సంగ్రహముగ సూచింపబడినది. ఈ స్పర్ధనే మానవజీవుని స్వాధీన పఱచుకొనుటకై దేవాసురులు చేయు కలహమని కొందరు కవులు వర్ణించియున్నారు. ఈ అంశమును ఇకను విస్తరముగ కామలోక (Astral Plane) మను పుస్తకమున వర్ణించియున్నాను. ప్రకృతమున ముఖ్య మైనదేమనగా, మానవుడు ఈ అంశములను బాగుగ గ్రహింపవలయు:—తన స్వరూపశక్తి ఉత్కృష్టమైనది; అది ఎల్లపుడు సన్మార్గము తట్టుననే పోవుటకు స్పర్ధించు చుండును; నికృష్టశక్తియేమో తాను కానేకాదు. మఱి యేమనగా తనకు స్వాధీనముకాకయుండు క్రిందిదేహ

ముల ఒకానొకయంశమే; దీనిని స్వాధీనపఱచుకొను టకు తాను యత్నించదగును. దీనిని పూర్ణముగ జయించి తగువిధమున నడచునట్లు చేయవలయు. ఇంత మాత్రమున అది దుష్టపదార్థమని యెంచదగదు. అదియుకూడ దానికి విహితమగుమార్గమున ప్రవహించు దేవశక్తిప్రవాహమని యెంచదగును. అయితే ప్రకృత మున దానిప్రవాహము ప్రకృతిమండలము తట్టు అధో ముఖముగ ప్రవహించుచున్నది కాని మనలోని దేవ శక్తివలె ప్రకృతిమండలమును వదిలి ఊర్ధ్వముఖముగ ప్రవహించుట లేదు.

---

## సప్తమాధ్యాయము

## మరణము

### I మరణతత్త్వజ్ఞానమువలని ప్రయోజనము

1. మరణతత్త్వజ్ఞానమువలని ప్రయోజనము— బ్రహ్మవిద్యాతత్త్వమును పూర్ణముగ అవగాహనము చేసికొనినచో కొన్ని కార్యకారియగు అంశములు ఫలించుచున్నవి. వానిలో ముఖ్యమైనది యేమనగా, మరణమునుగురించిన మనభావము బొత్తిగ మారుటయే. ఈ మార్పు అవశ్యముగ ఫలించును. ఈ మరణవిషయ మొకదానిగుఱించిన అజ్ఞానమువలనను మూఢాభిప్రాయమువలనను మాత్రమే మానవకోటి ఒట్టున అనుభవించుచువచ్చిన కేవల నిర్హేతుకమగు భీతియు వ్యథయు ఇంత అంత అని చెప్ప నలవికావు. ఈ అంశమున నిర్మూలమై వివేకరహితమగు ఆశయము మనలో నెంతో కలదు. అందువలన చెప్పనలవికాని అనర్థము పూర్వము సంభవించెను. ఇపుడును వర్ణింపతరముకాని దుఃఖము

అందుచే కలుగుచున్నది. దానిని నిర్మూలము చేసినచో మానవకోటికి మహోపకారము చేసినట్లగును.

౨. పూర్వజన్మకృత తత్వవిచార ఫలము—పూర్వ జన్మములలో తత్త్వశాస్త్రము నభ్యసించినవారు ప్రకృత జన్మమున బ్రహ్మవిద్యాశాస్త్రము బోధించు తత్త్వమును (Theosophical teaching) సులభముగ అంగీకరింప గలవారగుచున్నారు. వారికి ఆ బోధవలని ఉపకార ము తక్షణమే కలుగుచున్నది. ఆ బోధవలన తోడనే మరణమువలని భీతియు దానివలని వ్యసనములో శానా భాగమును తొలగిపోవుచున్నవి. ఆబోధవలన, మర ణము నిజముగ ఎంతటిది అను దానిని కనుటకును, ప్రపంచపురోభివృద్ధి పద్ధతిలో దాని కార్యాంశమెద్ది యను దానిని తెలిసికొనుటకును మనకు సాధ్యపడును.

౩. మృతునిగుఱించి వ్యసనపడదగదు—మరణము తో జీవితము ముగియుచున్నదనియు, మరణద్వారముగ అస్పష్టమైన భీతికరమగు నొక యజ్ఞాతదేశమున బ్రవే శించుచున్నారమనియు, తలచుట కలదు. అందుచే మరణ విషయమై ఒకవేళ స్పష్టమైన భీతి లేకపోయినను, అపాయశంక గలుగుట యేమో సహజమేకదా. మత

శాస్త్రమంతయు దీనికి విరుద్ధముగ బోధించుచున్నను పాశ్చాత్యదేశములందు ఈభావమే అంతట స్వీకృతమై యున్నది. కావున మరణ విషయమై అనేకభయలక్షణ ములుత్పన్నమై ఆచారరూపములుగ పరిణమించి యున్న వి. ఈ యాచారములను వివేచించి తెలిసికొనదగిన వారు కూడ ఏమియు యోచించక అనువర్తించు చున్నారు. నోరుమూసికొనియుండుట, రెక్కలు, నల్లని ముఖమల్లు, నల్లని భుజవస్త్రము, వ్యసనసూచకములగు ఈడుపులు, జాబువ్రాయుటకు నల్లంచు కాగితములు— ఈ మొదలగు ఘోరమగు వ్యసనజ్ఞాపక సామగ్రియం తయు, వానిని ఆచరించువారి యజ్ఞానమును ప్రకటించు చున్నదే కాని వేరుకాదు. మరణతత్త్వజ్ఞానముయొక్క ప్రారంభదశలో నుండువాడు తోడనే యీ యాడంబర ము నంతయు పిల్లల వెఱ్ఱితనమని వదలివేయును. అదేల యనగా—మరణమనునది వాని మిత్రునికి గలుగదగు మంచి భాగ్యమేకదా. మరణమువలని యీ మిత్రవియో గము వియోగముగ కనబడునదే కాని వాస్తవము కాదు. అట్టి వియోగదుఃఖమువలన గదా ఆ మిత్రవియోగము గుఱించి వ్యసనపడుట. మరణమనునది మృతుడైన వానికి

మంచి యదృష్టఫలమని తెలియరాగానె దానిగుఱించి వ్యసనపడుట కేవల స్వార్థపరతనే ప్రకటించుచున్నది. ఇట్లు ఆతత్త్వజ్ఞుడు భావించును. ఈకొద్దికాలపు వియోగము వలని బాధను అతడు అనుభవించక పోనేరడు. అయితే తనదుఃఖమువల్ల మృతుడైన మిత్రునికి ఆటంకము కలుగకుండునటుల చేయగలడు గదా.

4. మరణము సుఖద్వారము—మరణము తనకు సంభవించినను తన ప్రియులకు సంభవించినను దాని గుఱించి భయపడను వ్యసనపడను అక్కరలేదని మరణతత్త్వజ్ఞానికి తెలియును. మరణము వారికందరకు పూర్వము పలుమార్లు సంభవించినదే. కావున దాని విషయమై తెలియని యంశమేదియు లేదు. మరణమును ఒక ఘోరరూపమైన భయంకరరాజుగ నిరూపించుట కలదు. అట్లుచేయక మరణమును ఉత్తమలోక విభవముల బ్రవేశింపజేయు నొక దేవతగా నిరూపించుట తత్త్వానుసారముగను వివేకయుక్తముగను ఉండును.

5. మృతులు సదా సంనిహితులే—ఆత్మ ఎడతెగక జీవించియుండుననునది అతని అనుభవమున నిర్ణయమైన

అంశము. స్థూలదేహనాశమనగా ఒక ఉడుపును తీసి పారవేసినట్లే. అందుచే ఆ ఉడుపువేసికొనిన వాస్తవమైన మనుష్యునందు ఎవ్విధమైన మార్పును కలుగనేరదనునదియు అతనికి అనుభవసిద్ధమైన అంశమే. మరణమనగా, సగముకంటె హెచ్చుకాలము అనుభవించుచుండిన స్థూలదేహములోని జీవితమును వదలి దానికంటె ఉత్కృష్టమగు కేవల జ్యోతిర్మయమైన (astral) శరీరములో జీవించపోవుట. ఇది కేవలము అభివృద్ధియే యని అతడు గ్రహించును. కావున తనవిషయమున మరణమును నిష్కపటముగ వరించువాడే. అతని ప్రియుల కెవరికైనను మరణము సంభవించునపుడు వారికి దానివలన గలుగు గొప్ప లాభము తోడనే మనస్సునకు గోచరమగును. అయితే వారినుండి కొద్దికాలము వఱకైనను తాను ఎడబాసియుండవలసియున్నదికదా యని స్వార్థపరుడై కొంతమట్టుకు వ్యాకులపడకపోడు. ఇంతకు ఈ వియోగము, వాస్తవముగ చూచినచో, వియోగమువలె నగపడుటయే కాని యథార్థము కాదని అతనికి తెలిసియేయున్నది. మృతులనబడువారు ఇకను తన సమీపముననే యున్నారనియు, ముందువలె వారి

ప్రక్క నిలిచి వారితో సల్లాపమాడవలెననిన, నిద్రలో తన స్థూలదేహమును కొంతసేపుమాత్రము వదలి యుండవలసినదే యనియు, వానికి తెలిసియున్నది.

6. మరణానంతర స్థితినిగుఱించి జంకవలసినది లేదు —ప్రపంచమంతయు ఏకమే యనియు, స్థూలదృష్టికి గోచరమైనదియు అగోచరమైనదియు ప్రపంచమంతయు ఒక భగవచ్ఛాసనముచే ఏలబడుచున్నదనియు అతనికి స్పష్టమైనసంగతి. కావున ప్రపంచమందలి యొక భాగమునుండి మఱియొకభాగమునకు పోవుటలో వానికి జంకు గాని ఆశ్చర్యముగాని ఏమియు కలుగనేరదు. తెరకు ఆతట్టున ఏమికననగునో యను దానినిగుఱించి ఎట్టి సంశయము వానికుండదు. బ్రహ్మవిద్యావిచారకులచే అదృశ్యప్రపంచమంతయు అతిస్పష్టముగను సమగ్రముగను ఒక పటరూపముగ నిరూపింపబడియుండుటచే అతనికి స్థూలప్రపంచమువలెనే అదృశ్యప్రపంచము కూడ పరిచితమైయున్నది. కావున తన పురోభివృద్ధికి మిక్కిలి అనుకూలమగు నేకాలమున మరణముసంభవించినను ఏమియు శంకపడక అదృశ్యప్రపంచమున బ్రవేశించుటకు సంసిద్ధుడై యుండును.

## II కామవంతుల మరణానంతర స్థితిగతులు

7. మరణానంతరమున బాధపడువారిసంఖ్య స్వల్ప మే—ఈ ఉత్తమలోక యాత్రయందు మజిలీలు అనేక ములు గలవు. ఆ వివరముచు సమగ్రముగ తెలియగోరు వారు ఆ విషయమై వ్రాయబడిన గ్రంథవిశేషములను జదువవలెను. ఇక్కడ చెప్పవలసినది ఇంతే. ఏమనగా— మనుష్యునకు మరణానంతరము సంభవించు స్థితిగతులు తానే తనకు చేసికొనినవియే. ఎట్టి సంకల్పములను ఎట్టి కామములను భూలోకజన్మమందు తనలో ప్రో త్సాహపరచియుండెనో అవన్నియు దాని దానికి దగి నట్లు జీవవంతములగు వస్తురూపముల దాల్చి అతనిచుట్టు తిరుగుచు అతనిమనస్సున వికారముల గలుగచేయు చుండును. ఆ సంకల్పాదులకు భూజన్మమున అతడెంత బలమిచ్చియుండెనో అదంతయు క్షయించువరకు ఇవ్విధ ముగ నడచుచుండును. ఆ సంకల్పములును ఆ కామ ములును బలవంతములై అనవరతము దుష్టములుగ నుం డినచో అతడివ్విధముగ సృజించికొనిన సహచరులు వాస్తవముగనే భయంకరములుగ నుండవచ్చును. అయి తే ఒక సంతోషకరమగు సంశమేమనగా—జ్యో

తిర్మయలోక (astral_భువర్లోక) నివాసులలో అట్టివారి సంఖ్య బహు అల్పమే. ఈ లోకమందు సామాన్య మనుష్యుడు సాధారణముగ తనకు తాను నిర్మించుకొను ఆముష్మికస్థితిలో అతినికృష్టమైన దేమనగా—నిష్ప్రయోజనమై కేవలము విసుకుపుట్టించు ఆముష్మికస్థితి. అందున బుద్ధిమంతునికి ఏమియు అభిరుచి యుండనేరదు. ఈ భూలోకమున భోగమందును అల్పవ్యవహారమందును వృధామాటలాడుటయందును ఆయుస్సును వ్యయము చేయుటవలన సహజముగ ఫలించునదియే ఇట్టిస్థితి.

8. మరణానంతరపు బాధ—ఇట్టి విసుకుపుట్టించు స్థితికి తోడుగ కొన్ని సందర్భములలో తీవ్రమైన బాధయు చేరుకొనవచ్చును. భూలోకజన్మమున ఒక మనుష్యుడు స్థూలశరీరమునకు సంబంధించిన తీవ్రకామమునకు లోబడినవాడు కావచ్చును. దృష్టాంతముగా—పేరాస, కాముకత్వము, త్రాగుపోతుతనము, ఇట్టి దానికి లోబడినవా డనుకొందము. ఇది మరణానంతరము నరకబాధపడుటకు వాడు సేకరించు సామగ్రి యగుచున్నది. ఏలయనగా—స్థూలశరీరము వదలిపోగానే ఈ కామములును అభినివేశములును అతని నెన్నటికి వదలి

పోవు. ఎప్పటివలెనే అవి ఉజ్వలముగనుండును. ఇంతే కాదు. స్థూలభూతాంశముల కదలింప నిక నవసరములే నందున ముందుకంటె అధిక వేగముతో పనిచేయును. అతడు వాస్తవముగ పోగొట్టుకొనిన దేమనగా, ఈ కామముల దృప్తిచేసికొనుశక్తి. ఆశక్తి లేకపోవుటచే ఆ కామములు తృప్తిచెందక తృప్తిపరచ నశక్యమై, ప్రాణ హింస పెట్టుచు, పీకుచుండును. ఇది ఆ దౌర్భాగ్యపు మనిషి అనుభవించు నరకమే యని స్పష్టమగుచున్నది గదా. అయితే ఈ నరకము కొద్దికాలమే యుండును. ఏలయనగా, కాలక్రమమున అట్టికామముల వేగము తజ్జనిత దుఃఖరూపముగ క్షయించి ఆ కామములును దగ్ధమై పోవలయునుగదా.

9. ఆబాధ స్వయంకృతమే—ఇది యొక ఘోరావస్థయే, వాస్తవము. ఆయినను ఆవిషయమున మనము జ్ఞాపకముం దుంచుకొనదగినవి రెండంశములు గలవు. మొదటిది—ఆ మనుష్యుడు ఆ యవస్థను తానే తనపై తెచ్చుకొనినది కాక దానియొక్క వేగమును దాని యనుభవకాలమును కూడ తాను నిర్ణయించుకొనినది యే. అతడు భూజన్మమున ఈ కామము కొంతవరకు

బలపడనిచ్చెను ; ఇప్పుడు దాని నెదుర్కొని అణచవలసి యున్నది. స్థూలశరీరమందు జీవించియుండినప్పుడు ఆ కామమును అణచుటకుగాని ఆపుటకుగాని యత్నించి యుండినచో ఇప్పుడు దాని జయించు కష్టము ఆ యత్న ముకొలది తక్కువగనుండును. ఇప్పుడు వాడు పోరాడ వలసియుండు భూతమును తానే తనకై సృష్టిచేసికొని నది. ఆ శత్రువునకు బలమేమున్నను అది వాడిచ్చి నదే. కావున ఈ యవస్థ బయటనుండి ఎవరో వానికి కలుగచేసినది కాదు ; తానే చేసికొనినది కాని మరేమి కాదు.

10. అది అనుభవించియే తీరవలెను—రెండవది. ఇవ్విధముగ తానై తెచ్చుకొను బాధ యొకటే అందు నుండి తప్పించుకొను దారి. ఆ బాధను తప్పించుకొను టకును, నికృష్టకామములు పైజెప్పిన విధముగ క్రమ ముగా క్షీణించకయే జ్యోతిర్మయలోక (భువర్లోక— Astral life) వాసకాలమంతయు గడపుటకును, వానికి సాధ్యమైయుండినచో ఫలితమేమై యుండును? అది స్పష్టమే కదా. రాబోవు భూలోక జన్మమున ప్రవేశించు నపుడు ఈ కామములకు సుతరాం వశుడై యుండును.

వాడు పుట్టుకతోనే తాగుపోతు వగును, కాముకుడగును, పిశినారిగొడ్డు అగును. అట్టి కామముల నణచయత్నించ వలెనని బోధింపసాధ్యమగుటకు ఎంతో మునువే అణచ నలవికానంతవరకు బలవంతములై పెరిగిపోవును. ఆ కామములు అతని దేహమును ఆత్మను గులాముగ జేసి కొనును. అందుచే ఇంకొక జన్మము వ్యర్థమై పోవును; ఇంకొక సుసమయము తప్పిపోవును. ఇవ్విధముగ దుశ్చ క్రమున తగులుకొని అందునుండి తప్పించుకొను దారి గానక తన పురోభివృద్ధికి ఎంతోకాలము అడ్డిచేసి కొనును.

11. భగవంతుని సంకల్పమే యది—భగవంతుని రచనలో ఇట్టి లోపము లేదు. భువర్లోక వాస (Astral life) కాలమున కామము క్షీణమైపోయి తిరిగి స్థూలశరీరమున జన్మమెత్తునప్పటికి ఆ మనుష్యునిలో అది లేకయుండును. కామవశునిగా జేసిన మనోదౌ ర్బల్యము మాత్రము ఇకను ఉండునదేమో నిజమే. నూతన జన్మమందును పూర్వమువలెనే అదేకామము ఆవిర్భవించదగు కామశరీరమును తానై కల్పించుకొను నదియును నిజమే. కాబట్టి వాడు తిరిగి పూర్వావు

దుర్వృత్తి నవలంబించుట అసంభావితము కాదు. అయితే, అంతరాత్మ (The Ego) కదా నిజమైన మనిషి. అతనికి భీకరమైన అనుభవము గలిగెను గాన, తప్పక వాడేమో అన్నివిధముల ప్రయత్నము చేసి తన నికృష్టశరీర వ్యవహారమున ముందు చేసినతప్పును తిరిగి చేయనేరడు, అనగా, తిరిగి అదే కామమునకు లో బడక తప్పించుకొనును. ఇంకను దాని బీజమేమో అతనియందుండును. అయితే ఆతని పూర్వ సుకృతము వల్ల మంచి వివేకులగు తల్లిదండ్రులు కలిగినచో, వారి సహాయముచే సుగుణమును అభివృద్ధిచేసికొని దుర్గుణ మును ఆపివేసికొనును. అందుచే దుర్గుణబీజములు ఫలోన్ముఖము గాకయుండి క్షయించిపోవునుగాన దానికి తరువాతిజన్మమున అవి నుతరాం అదృశ్యమై పోవును. ఇట్లు కొంచె కొంచెముగ మనుష్యుడు దుర్గుణముల జయించి వాని స్థానములో సుగుణముల నభివృద్ధి చేసికొనును.

### III. వివేకవంతుని మరణానంతర స్థితిగతులు

12. వివేకవంతుని కామలోకపు స్థితి—ఇక వేరొక విధమగు మనిషిని గురించి విచారింతము. బుద్ధిమంతు

డును ఉపకారపరుడు నగువాడు ఈ సూక్ష్మలోకపు స్థితిగతులను తెలిసికొని వాటికి తగునట్లు నడచుకొని వాటినుండి కలుగదగు లాభమంతను పొందుటకు కావలసినంత శ్రమపడినచో, నూతనజ్ఞానమును సంపాదించుటకును సప్రయోజనకార్యముల చేయుటకును తగిన సమయ సామగ్రి సంపత్తు వానికెదుట సిద్ధముగ నుండును. ఈ స్థూలదేహ రహితమైన స్థితి యెంతో ఉజ్వలముగను స్పష్టముగను నుండునను దానిని వాడు కనుగొనును. ఆ అనుభవమును భూలోకానుభవముతో పోల్చిచూచినచో సూర్యచంద్రుల ప్రకాశముల కుండు నంత తారతమ్యముండును. తన శుద్ధమైన జ్ఞానద్వారముగను శాంతమై ధీరమైన మనస్సుద్వారముగను అపార చైతన్యశక్తి తనచుట్టునుండు చేతనులపై ప్రకాశించుటను వాడు కనుగొనును. చెప్పనలవికాని శాంతియు ఆనందమును అతనినుండి అతని చుట్టునుండు తోటిమనుజులకు ప్రవహించును. ఈ భువర్లోక వాసకాలమున కొద్ది సంవత్సరములలోనే, స్థూలశరీరమున ఎంతో దీర్ఘకాలము జీవించి చేయగలిగినదానికంటె, హెచ్చుగ హితకార్యముల చేయగలుగును.

## IV. స్వర్గలోకము, దాని ప్రయోజనము

13. స్వర్గస్వరూపము—ఈ మరణానంతరపు అద్భుత జీవయాత్రయందలి భువర్లోకవాసముకంటెను మహత్తైన ఇంకొకస్థితి ముందు సిద్ధించబోవుచున్నదను నదియు కూడ అతనికి బాగుగ తెలియును. తన కామములచేతను అశుద్ధ సంకల్పములచేతను తన భువర్లోక సంనివేశములను తానే కల్పించికొనిన లాగుననే, తన శుద్ధ సంకల్పములచేతను ఉత్కృష్ట అభినివేశముల చేతను తన స్వర్గలోకపు స్థితిని కూడ తానే కల్పించుకొనియున్నాడు. స్వర్గమనగా వట్టి కల గాదు; అనుభవనీయమగు, అతి వైభవముతో గూడిన, వాస్తవ స్థితి. స్వర్గమనగా నక్షత్రమండలమున కావల ఎక్కడనో దూరముగ ముత్యాలవాకిళ్లు బంగారువీధులు గలిగి అనుగ్రహపాత్రులగు కొందఱి వాసమునకై పెట్టిపెట్టిన పట్టనము కాదు. మఱేమనగా, అది యొక చైతన్యావస్థా విశేషము. భూలోకపు జన్మముల రెంటికి మధ్యకాలమున ప్రతిమనిషియు ఆ యవస్థయందు కొంతకాల ముండువాడే. అదేమో శాశ్వతవాసస్థానము గాదు, నిజమే. అది వర్ణింపనలవికాని యొక ఆనందావస్థ, అనేక శతా

బ్దములవఱకు ఉండునది. అది అంతటిదిమాత్రమే కాదు; ఏలయనగా—నానామతములందు వర్ణితమైయుండు స్వర్గమనుదానిలో గర్భితమగు ఉత్తమోత్తమ ఆత్మ ధర్మములతత్త్వము ఇందున ఇమిడియున్నను— కేవలము ఆదృష్టితోనే దాని నేమాత్రము జూడదగదు.

14. స్వర్గానుభవ ప్రయోజనము—ఈ లోకము ప్రపంచమున మనకు అతిప్రయోజనకరమైన భాగము. అది అతివైభవమును వైశద్యమును గల విస్తారమైన లోకము. భూలోకపు జన్మముల రెంటికి మధ్యకాలము లందువలెనే ప్రకృతమునకూడ మనము వసించులోక మే యది. మన పరిపాకమందలి లోపము, ఈ మాంస మయకోశ కృతమగు దృష్టిసంకోచము, ఈ కారణ ములవలననే, మన చుట్టును ప్రకృతమున, ఇక్కడనే, ఉత్తమస్వర్గవైభవమంతయు ఉన్నను మనము పూర్ణముగ గ్రహించలేకయున్నాము. ఇదిగాక ఆలోకమునుండి ప్రవహించు శక్తివిశేషములు మనపై ఎవుడును ప్రసరిం చుచునే యున్నవి. అయితే మనము వానిని తెలిసి కొని స్వీకరించవలెను. అట్లుచేయక ఆ తత్త్వమును మనము గ్రహించకపోవుటకును పైజెప్పినవే కారణ

షులు. కేవల పామరునకు ఇదంతయు అసంభావితమని తోచవచ్చునుగాని, యోగసాధకునకు ఈ తత్త్వము అతి స్పష్టమైనదే. ఇప్పటికిగూడ ఈ మూలతత్త్వమును గ్రహించనివారికొఱకై బౌద్ధాచార్యు లొకరు సెల విచ్చిన బోధనవాక్యమును మాత్రము నిక్కడ ననువదించెదను:

"మొరలిడకుము, రోదనము చేయకుము, ప్రార్థించకుము. కండ్లుమాత్రము తెరిచి చూడుము. మీకండ్ల కట్టునుమాత్రము తీసివేసి చూచినచో మీచుట్టునంతట జ్యోతిస్సు ఉండనేయున్నది. అది అత్యద్భుతము, అతిసుందరము, ఎవడు కలలోగన్నదానికిని ప్రార్థించిన దానికిని అతీతము. అది శాశ్వతము శాశ్వతము."

15. స్వర్గసుఖానుభవ విధము—అశుద్ధకామసంకల్పములకు స్థానమైన కామదేహము (astral body) క్రమక్రమముగ క్షీణించిపోయి పారవేయబడిన తరువాత, మనుష్యుడు మానసశరీరమను దానిలో వసించును. ఇది కామదేహముకంటె ఉత్కృష్టమైనది, సూక్ష్మతరభూతనిర్మితమైనది. మానసలోకములో నతనిని స్పర్శించు బాహ్యమానసభౌతికపదార్థ స్పందములను

ఈ శరీరముద్వారా అతడు అనుభవించగలుగును. పాపశోధనకాలము గతించిపోయెను; అతని నికృష్ట స్వభావము దగ్ధమాయె. భూలోకజన్మమున నతడు భావించియుండిన ఉత్కృష్ట సంకల్పాభినివేశములే ఇప్పుడు మిగిలియుండునవి. అవన్నియు అతనిచుట్టు పోగై అతనికి కవచరూపమగును. దానిద్వారా తనచుట్టునుండు సూక్ష్మభౌతిక పదార్థముల స్పందములను అతడు కొన్నిటిని అనుభవింపగలుగును. అతనిని చుట్టుకొను ఇట్టి సంకల్పరూపములగు శక్తులచే స్వర్గలోకసంపత్తు నాకర్షించుకొనును. ఈశ్వరుని మనస్సుయొక్క ప్రతిబింబమే ఈ మానసలోకము. అదియొక అపారమైన ఉగ్రాణము. స్వర్గభోక్తయగువాడు భూభువర్లోకమున తనలో నావిర్భావము చేసికొనియుండిన సంకల్పాభినివేశముల శక్తికొలది ఆ యుగ్రాణములోనుండి సుఖమును ఆకర్షించుకొనగలుగును.

16. స్వర్గసుఖము అందరకు లభ్యము—అన్ని మతములును స్వర్గసుఖమును ప్రతిపాదించియున్నవి కాని ఈ ముఖ్యతత్త్వమును మనకు ఎంతకావలెనో అంత స్పష్టముగ వెల్లడిచేసినవి కొద్దియే. ఈ తత్త్వము తెలిసి

నవే, అందరకును ఆ సుఖము సంభవించుగలదనునది ఉపపన్నమగును. ఆ తత్వమే స్వర్గసిద్ధాంతమునకు ఆధారభూతము. ఆతత్వ మేమనగా, ప్రతియొకడును వాచామగోచరమగు సాక్షాత్తు ఈశ్వరమనస్సునందలి విభవమునుండి ఏరి తన యభీష్టమగు స్వర్గవిభవమును నిర్మించుకొనువాడు అనునదియే. భూలోకజన్మమున చేయుసుకృతముల వలననే వాని స్వర్గసుఖ మెట్టిదనునది యు ఎంతకాలము అనుభవనీయ మనునదియు ఈ రెండును నిర్ణయమగుచున్నవి. కావుననే తానైసంపాదించుకొనినంతయు అతనికి లభించకపోనేరదు. అతని స్వభావ విశేషమునకు ఉచితమగు ఆనందవిశేషమును అతనికి లభించక పోనేరదు. ఈ మానసలోకమున మేల్కొని యుండు ప్రతిప్రాణియు అట్లు మేల్కొనియుండుట వలననే అక్కడి ఆత్మానందాధిక్యమును తన శక్తికొలది అనుభవించుచునే యుండవలెను. ఆ లోకములో ఆనందాభినివేశము పూర్ణముగ సఫలమగుటకు భోక్తయొక్క అభినివేశశక్తిలోపము తప్ప వేఱు మితి లేదు.

ఇది సంగ్రహము. ఈ విషయమై సవిస్తరముగ తెలియగోరువారు గ్రంథాంతరముల జదువవలయు.

---

## అష్టమాధ్యాయము

### మనుజుని భూతభవిష్యత్తులు

1. భూతజ్ఞానసాధనము—దీర్ఘమై వివిధమగు జన్మ సంతానద్వారముగ మనుజుడు ఇప్పటిస్థితికి వచ్చియు న్నాడను సంగతి మన అవగాహనకు వచ్చినతోడనే మన మనస్సున సహజముగ నొక జిజ్ఞాస పుట్టుచున్నది. అదేమనగా—ఈ పూర్వకాలపు వృద్ధిక్రమ విషయ మగు జ్ఞానమును మన మేవిధముగ ఎంతమట్టుకు సంపా దించగలము? ఇది మనకు అతి స్వారస్యమైన అంశమను నది స్పష్టమేకదా. మన అదృష్టమువల్ల ఈ యంశమును తెలిసికొనుటకు దగిన సాధనములు గలవు. కేవల ఐతి హ్యమే కాదు; దానికంటె సునిశ్చితమైన దోవయు కల దు. మనోమానము (Psychometry) అను శాస్త్ర మందలి అద్భుతాంశముల వర్ణింప నిక్కడ అవకాశము లేదు, కాని ఆ విషయమై నేను చెప్పవలసిన యొక అంశము గలదు. అదేమనగా ప్రపంచమున జరుగు సంగ తులలో నేదియును మాసిపోకుండ లిఖితము కానిది

లేదను విషయమున ప్రమాణము మెండుగ నున్నది. అనగా, ప్రకృతిమండలమున ఒక విధమగు జ్ఞప్తికలదు. అందునుండి, జగత్ప్రారంభము మొదలు జరిగిన సంగతులలో నేదానిపటమునైనను, కొంచెమైనను తప్పులేక తిరిగి సంపాదించవచ్చును. ఎవరికి నీవిషయము బొత్తిగ తెలియదో అట్టివారు ప్రమాణము దెలియగోరు వారు Dr. Buchanan గారు Psychometry గురించి వ్రాసిన పుస్తకమును చదువవలయు. అయితే గుప్త విద్యాపరాయణుల (Occult Students) కేమో ఇట్టి జ్ఞానము సాధ్యమనునది బాగుగ తెలిసిన అంశమే. వారిలో ననేకులకు ఈ భూత సంగతుల జదువుటకు దగిన మార్గముకూడ తెలిసియున్నది.

2. ప్రకృతమండలమందలి జ్ఞప్తి—సారాంశమున, ఈ ప్రకృతి మండల జ్ఞప్తి యనునది దేవుని జ్ఞాపకశక్తిగ నుండవలె. అది మనుజునికి అందరాని దూరముననుండునది. అయితే అది క్రిందిలోకములలో అవశ్యముగ ప్రతిఫలితము కాదగినది. కావున ఈ క్రిందిలోకపు సంగతులకు సంబంధించువరకు ఆజ్ఞప్తిలోనుండు అంశములను మానవుని సుశిక్షిత బుద్ధిచే గ్రహింపవచ్చును.

దీనికొక దృష్టాంతము. అద్దమునకెదుట నడుచున దంత యు దానిపై ప్రతిఫలించును గదా. మబ్బుకప్పిన మన కండ్లకు ఆ యద్దముపై ఆ ప్రతిబింబముల గుర్తులేవియు లేనటులనే తోచును. ప్రతియొక ప్రతిబింబము గుర్తునే మియు నుంచక పారిపోవునటుల నుండును; కాని వాస్తవ ముల్లో అట్లుండనేరదు. ఒకగుర్తు ఉంచబడునని యూ హించుటకు అవకాశము లేకపోలేదు. దీనికి దృష్టాంత ము—ప్రతియొక ధ్వనియు ధ్వానగ్రాహక యంత్ర (Phonograph) ము గొట్టముపై ఒక గుర్తు విడుచును గదా. ధ్వానగ్రాహకమునుండి, పూర్వగృహీత ధ్వనుల నెటులనో యటులనే అద్దమునుండి కూడ పూర్వగృహీత ప్రతిబింబములను తిరిగి సంపాదించుట సాధ్యము కా వచ్చును.

౮. భూతమెట్లు తెలిసికొనవచ్చును—ఇది సంభావ నామాత్రమే కాదు. ఇది నిర్ణీతమైన వస్తుస్థితియే యను నది ఉత్కృష్టమనోమానశాస్త్రము (Psychometry) వల్ల తెలియవచ్చుచున్నది. ఒక అద్దమందే కాదు; ఏ భౌతికపదార్థమందైనను దాని సమక్షమున జరుగు సంగ తుల గుర్తులు నిలిచియుండును. ఇవ్విధముగ మన జగత్తు

యొక్కయు అందలి మానవకోటియొక్కయు పూర్వ చరిత్రమును నిశ్చయముగా యథావత్తుగ తెలిసికొనుటకు దగినమార్గము మనకు లభ్యమె. ఈ మార్గమున అత్యంతస్వారస్యమైన అనేక సంగతులను సవిస్తరముగ చూడ గలుగుదుము. ఆ సందర్భములన్నియు మన ప్రయోజనార్థమై మన యెదుట నటింపబడినట్లుండును.

4. మానవపరిణామమార్గము—ఈ మార్గమున తొలిచరిత్రమును పరీక్షచేయుటవల్ల ఒక అంశము నిష్పన్న మాయెను. అదేమనగా—చిరకాలమునుండి క్రమక్రమముగ అనవరతముగ మానవ పరిణామము జరుగుచు వచ్చుచున్నదను అంశము. మానవ పరిణామము రెండు విధానములకు లోబడి జరుగుచున్నదను అంశము ఆ పరీక్షవల్ల తేలుచున్నది. ఆ రెంటిలో మొదటి విధాన మేమనగా—జగత్పరిణామ విధానము. ఇది ఎడతెగక మనుజుని ముందుకును ఊర్ధ్వముగను తోసికొని పోవుచుండును. రెండవ దేమనగా—దైవికనియతి, అనగా కార్యకారణ నియమము. ఈ నియమము ననుసరించియే మనుజుడు చేయు ప్రతియొక వ్యాపారమునకును తగిన ఫలము అవశ్యముగ లభించుట. దీని మూలకముగ

క్రమేణ మనుజుడు వివేకయుక్తుడై మొదటి నియమమునకు అనుకూలముగ నడుచుకొను బుద్ధిని నేర్చుకొనుచున్నాడు.

5. లోకాంతరమందలి మానవ పరిణామము—ఈ దీర్ఘపరిణామ విధానము ఈ భూలోకముననే కాదు; దానికి సంబంధించిన లోకాంతరములందు కూడ జరుగుచు వచ్చియున్నది. అయితే ఆ విషయము అతి విస్తృతము కావున ఈ చిన్న ప్రకరణగ్రంథమున విస్తరించి ప్రతిపాదింప నలవికాదు. ఆ విషయము బ్లవాట్స్కి దొరసానిగారి చిరస్థాయి యగు "గుప్తసిద్ధాంతము" (Secret Doctrine) నందలి ముఖ్యప్రమేయము. అయితే ఆ గ్రంథమును చదువ ప్రారంభించుటకు పూర్వము శ్రీమతి బెసంటుగారి "సనాతన సిద్ధాంతము" (Ancient Wisdom), సిన్నెట్టు గారి "ఆత్మపరిపాకము" (Growth of the Soul) అను గ్రంథములలోని పరిణామ విషయమగు అధ్యాయముల జదువుట మంచిది.

6. మానవుని భవిష్యత్తు—పై బేర్కొనిన గ్రంథములనుండి మానవుని పూర్వచరిత్రము గురించియే కాక అతని భవిష్యద్గతిని గురించియు కూడ ఇపుడు జ్ఞాన

సాధ్యమగు అంశములను పూర్ణముగ తెలిసికొనవచ్చును. మనుజునకు ఉత్తరోత్తరమున లభ్యమగు విభవాతిశయము చెప్పనలవికానిదయినను తత్పూర్వభావియగు భూమికలగురించి కొన్ని అంశములైనను మన అవగాహనకు రావచ్చును. ప్రకృతమున కూడ మనజుడు భగవత్స్వరూపుడే, సమీపకాలమందే భగవచ్ఛక్తి విశేషములను తనయందు ఆవిర్భావము చేసికొనగలవాడే, అను నీ సిద్ధాంతము కొంతమంది సత్పురుషులకు కూడ అతి విపరీతముగ కనబడును. అది దేవనిందయే యని కూడ వారు తలంచుదురు. వారెందుకట్లు తలచెదరో ఆ కారణము సుజ్ఞేయము కాదు. ఏల! యేసువే చెప్పియున్నాడు కదా! యూదేయుల వేదములో నుండు—“మీరు భగవంతులని నే చెప్పితిని” అను—వాక్యమును యేసువు వారిజ్ఞప్తికి తెచ్చెనుగదా! మనుజునకు భగవత్స్వరూపప్రాప్తి కాగలదను సిద్ధాంతమును ప్రాచీన క్రైస్తవ పాదిరీలు సర్వసాధారణముగ నమ్మియుండిరి. అయితే ఇప్పటికాలమువారు ప్రాచీనశాస్త్రశుద్ధమైన సిద్ధాంతములోని పెక్కుభాగమును మరచిపోయి విపరీతముగ గ్రహించియున్నారు. ఇపుడు గుప్త

విద్యాపరుడు (Student of Occultism) ఒకడు మాత్ర మే తత్వార్థమును పూర్ణముగ నమ్మియుండునటుల కన బడుచున్నది.

7. ఈశ్వరాంశుడగు మనుజునకు పరిణామ మెందుకు ?—ఒక్కొకసారి జనులు ప్రశ్న చేయుట కలదు. ఎట్లనగా, మనుజుడు ఆదియందు ఈశ్వరాంశు డైనచో, అనేక కల్పాంతరముల కాలము ఈ దుఃఖభూయిష్ఠమైన పరిణామ మార్గమున సంచరించవలసిన యావశ్యకత యేమి ? పరిణామాంతమున ఈశ్వరాంశభూతుడుగనే కదా యుండబోవుచున్నాడు ? అయితే ఇట్టి యాక్షేపణ చేయువారు భగవంతుని జగద్రచనావిధానమును ఇకను తెలిసికొనిన వారు కారు. ఈశ్వరునుండి వెడలిన అంశమునకు వెడలినపుడే మనుష్యత్వము రాలేదు. దానిని కణము అని కూడ చెప్పనలవి కాదు ; ఏలయనగా, అందున ప్రత్యేక జీవత్వము అప్పటికి నిష్పన్నము కాలేదు. అపుడు కేవలము ఒక పెద్ద మబ్బురూపమున నుండు ఈశ్వర తత్వమే యది; అయితే పరిణామమున అనేక కణములుగా ఘనీభవించు శక్తి గలది.

8. పరిణామ ప్రయోజనము సదృష్టాంతము.—భగవంతు నుండి వెడలినప్పటి స్వరూపమునకును భగవంతునందు తిరిగి వచ్చిచేరునప్పటి మనుజుని స్వరూపమునకును భేదమెట్టిదనగా, మొదలు అతి ప్రకాశ భూయిష్ఠమై యుండిన అస్పష్టభూత (Nebulous Matter) మహాసంచయమునకును అందునుండి పరిణమించిన సూర్యమండలమునకును గల భేదము వంటిది. అస్పష్టభూత (Nebula) సంచయ మేమో చాలా అందమైనదే; ఏమియు సంశయము లేదు. అయితే అది మబ్బుగా నున్నందున ప్రయోజనకారి కాదు. అందునుండి మెల్లగ క్రమక్రమముగ పరిణమించిన సూర్యమండలముల నుండియేమో అనేక లోకములకును అందు నివసించువారికిని ప్రాణశక్తియు ఉష్ణమును వెలుతురును ప్రవహించుచున్నవి కదా!

9. మఱియొక దృష్టాంతము.—లేక, ఇంకొక దృష్టాంత మెత్తుకొనెదము. మానవశరీరమున కోట్యంతరములు లెక్కలేని చిన్న అణువులు చేరియున్నవి. వానిలో కొన్ని శరీరమునుండి ఎల్లపుడు తోసివేయబడుచునే యున్నవి. అట్లు వెడలిన అణువులలో ప్రతి యొకటియు

ఒక పరిణామ విశేషమువల్ల కాలక్రమమున మనుష్యత్వము జెందుట సాధ్యమనుకొనెదము. అట్టి అణువు పరిణామాదియందు మనుజుడే యని ఏదోయొక విధముగ చెప్పదగిన మాత్రముననే పరిణామాంతమున దానికేమియు లాభము కలుగ లేదని మనము చెప్పకూడదు గదా. మనుజుని తత్త్వాంశము ఈశ్వరశక్తి రూపమే అయినను, కేవల శక్తి ఉద్రేకరూపముగ వెడలును. (పరిణామాంతమున) తిరిగి ఈశ్వరునిలో వచ్చి చేరునపుడు అనేకకోట్లకొలది మహాసిద్ధపురుషులై, వారిలో ప్రతియొకరును తామే ఈశ్వరులు కాగలవారై, వచ్చుచున్నారు.

10. భావివైభవము సర్వప్రాప్యము — ఈరీతిగ, మనుజుని భావిగతియొక్క వైభవమహిమలు అపారమైనవి యని చెప్పుటకు హేతువులు మెండుగ నున్నవని కనబడుచున్నదికదా. ఈ మహావైభవ యుక్తమగు భావిగతిని అందరును ఒకరైనను తప్పక పొందగలరు అనునది మనము జ్ఞప్తినుంచుకొనదగిన అతి ముఖ్యాంశము. సత్పురుషుడనబడువాడు, అనగా ఈశ్వరసంకల్పానుసారముగ సంకల్పించి జగత్పరిణామమార్గమునందు సహాయ

పడుచు వర్తించువాడు ఊర్ధ్వమార్గమున శీఘ్రముగ అభివృద్ధిజెందును. అట్లుకాక వివేకరహితుడై మహా ప్రవాహమునకు ఎదురై నిలిచి సర్వభూతహితమునకై పాటుపడుటకు బదులుగ స్వార్థపరుడై వర్తించువాడును అభివృద్ధిజెందగలడు కాని, అతిమందగతితోను తప్పు మార్గములలోపడి లేచుచు ముందుకు బోవును. అయితే ఈశ్వరసంకల్పము ఏమనుజుని సంకల్పముకంటెను అత్యంత బలిష్ఠము. ఈశ్వరుని జగద్రచనా సంకల్ప మేమో సంపూర్ణముగ సిద్ధించగలది. ఆదియందే యీ జ్ఞేయాంశమును నేర్చనివాడు దానిని నేర్చువరకు మళ్లీమళ్లీ ప్రయత్నముచేసి పాటుపడవలసినదే. భగవంతుని యోర్పు అపారము. క్రాంచెము ముందువెనుకగా ప్రతిమనుజుడును వానికి విహితమగు పదవిని పొందనే పొందును. ఏమియు భయపడవలసినది లేదు. అందున నేమియు సంశయలేదు. ఈశ్వరుని సంకల్పమును నియతిని తెలిసిన వారలకేమో పూర్ణశాంతి లభించగలదు.

---

## నవమాధ్యాయము

### కార్యకారణములు

1. కార్యకారణనియతి—కర్మకు తగినఫలము అవశ్యముగ గలుగునను మహానియతి (Law) ని పూర్వాధ్యాయములలో సదా మనము మనస్సున నుంచుకొనవలసి యుండెను. ఆ నియతి ననుసరించియే ప్రతిమనుజుడును తనకు న్యాయ్యముగా చెల్లదగు లాభమును అవశ్యముగ పొందుచున్నాడు. ఇట్టి నియతి లేనియెడల ఈశ్వరుని తక్కిన జగద్రచనయంతయు మనకు దురవగాహమగును. ఈ నియతియొక్క ప్రయోజనమును ప్రయత్నపడి చక్కగ అవగాహనము చేసికొనుట మనకు లాభకరమే. అట్టి అవగాహనకు మొదటి మెట్టు ఏమనగా—మనుజునికర్మకు తగినటుల బహుమానమో శిక్షయో కలుగునని మతము బోధించు భావమును మనమనస్సునుండి పూర్ణముగ తొలగించవలయును. అట్టి భావము నుంచుకొనినచో దానితో గూడ అట్టి బహుమానమును శిక్షను విధించు న్యాయా

ధిపతి యొకడుండవలెనను భావము అవశ్యముగ చేరు కొనును. దాని వెంబడే పుట్టు భావాంతరము లేవన గా—ఆ న్యాయాధిపతి ఒకనికంటె మఱి యొకనిపై నెక్కువ దయ చూపవచ్చుననియు, అతడు సందర్భ విశేషముల ననుసరించి తీర్మానము చేయుననియు, అత నిని ప్రార్థించుకొనవచ్చుననియు, అందుచే నియత ఫల మును మార్చుటకు గాని బొత్తిగ తప్పించుకొనుటకు గాని సాధ్యమగుననియును.

2. వేఱుగ బహుమతి శిక్షల నొసర్చునతడు లేడు— ఇట్టి సూచనలలో ప్రతియొకటియు బొత్తిగ తప్పుదోవల నీడ్చునదియె. తత్త్వార్థమును మనము తెలిసికొనవలెనని నచో మొదలు వానికి హేతుభూతమగు సిద్ధాంతమంత ను మనస్సునుండి తొలగించి పారదోలవలసినదే. ఎఱ్ఱగ కాలుచుండు ఇనుపకమ్మిపై యొకడు చేయిపెట్టినచో సామాన్యస్థితిలో వానిచేతికి శానామంట కలుగును కదా. అయితే కమ్మిపై చేయిపెట్టిన దానికి దేవుడు శిక్షచేసెనని వాడెంచనేరడు. వాడేమనుకొనుననగా, తనకు సంభ వించినబాధ ప్రకృతిధర్మనియమానుసారముగ సంభ వించునని నిరీక్షించదగినదే. ఉష్ణస్వరూపమును దాని

కార్యమును తెలిసికొనినవాడు మంట ఎట్లు కలిగెనను దానికి చక్కని ఉపపత్తి చెప్పగలడు.

3. మనుజుడు స్థూలఫలమును మార్చనేరడు—ఒక అంశమును గమనించవలసినది. మనుజుని యుద్దేశమెట్టి దైనను స్థూలభౌతికఫలమును ఏ విధముగను మార్చ నేరడు. ఒకనికి అపాయము చేయవలెనని కమ్మినిముట్టి నను, లేక మఱియొకరిని అపాయమునుండి కాపాడవలెనని ముట్టినను, వానిచేతికి ఏకరీతిగ మంటకలుగును. అయి తే, ఇట్లు కాక సూక్ష్మదృష్టితో చూచినచో ఫలితాంశ ములు అతిభిన్నములుగ నుండును. కాపాడవలెనని ముట్టినచో అతడు సుకృతము చేసినవాడగును. అతని మనస్సాక్షికిని తృప్తి లభించును. అపాయముచేయవలె నని ముట్టినచో ఖేదము కలుగునేకాని వేఱు కాదు. స్థూలదేహమందలి మంటమాత్రము రెండవపక్షమందు వలె మొదటి పక్షమందును కలుగక తీరదు.

4. కార్యకారణనియతి యేకవిధము—ఈ కార్య కారణనియమ ప్రవృత్తిని చక్కగ తెలియవలెననిన, ఆ నియమము ఏకరీతిగ తనంతట తానే ప్రవర్తించుచున్న దని మనము భావింపవలెను. ఇందుకొక దృష్టాంతము.

లోకప్పునకు త్రాటితో గట్టిన ఒక బరువైన వస్తువు వ్రేలాడుచున్న దనుకొందము. ఆ వస్తువును నేను కొంత బలముతో తోసినట్లైతే అదేబలముతో ఆవస్తువు నా చేయిని వెనుకకు త్రోయుననునది యంత్రశాస్త్ర సిద్ధమే. స్తిమితమై యున్న ఆవస్తువును ఏకారణమువల్ల నేను త్రోసినను ఆ కారణమును కొంచెమైనను గమనించక ఈ ప్రతిక్రియ నాకు కలుగునుకదా. ఆలాగుననే యొక దుష్కార్యమును చేయువాడు స్తిమితమై ప్రవహించు చుండు ప్రపంచ పురోవృద్ధి మహాప్రవాహమును కలియ పెట్టుచున్నాడు. ఆ మహాప్రవాహము తిరిగి స్తిమితభావ మును చెందునపుడు అతనికి తప్పక ముప్పు గలుగును.

౬. ఉద్దేశ ప్రయోజనము—ఈ కారణమునుబట్టి కార్యోద్దేశమువల్ల విశేషమేమియు లేదని ఎన్నటికి నెంచదగదు. పరంతు ఉద్దేశము బట్టి స్థూలప్రపంచ మందలి ఫలమున విశేషములేకపోయినను, కార్యహే తువులపైకి ఉద్దేశమనునది ముఖ్యతమమైనది. ఉద్దేశ మనునది స్వయముగనే యొక బలవిశేషమను నంశమును మనము మఱచెదమేమో. అది మనోలోకమున ప్రవర్తిం చునది. ఆలోకమునందలి భూతములు అతిసూక్ష్మములై

క్రింది మనలోకమువానికంటె ఎంతోవేగముగ స్పందించునవిగాన క్రింద మనము వినియోగించు శక్తినే మనోలోకమున వినియోగించినచో ఎంతో అధికఫలోత్పత్తి గలుగును. స్థూలకార్యఫలము స్థూలప్రపంచమున కలుగును. ఉద్దేశరూపమగు మనో వేగముయొక్క ఫలమైతేనో మనోలోకమందలి ప్రకృతిమండలమున వేఱుగ స్థూలఫలమునకు ఏసంబంధమును లేక అదేకాలమందు సిద్ధించును. రెంటిలో ఉద్దేశఫలము ఎన్నిమణుంగులో హెచ్చియుండుట నిశ్చయము. ఇవ్విధముగ సర్వథా న్యాయ్యమగుఫలానుభవము సర్వదా సిద్ధించుట స్పష్టమే కదా. ఉద్దేశములెంత సంకీర్ణములైనను స్థూలఫలములలో శుభాశుభములెట్లు చేరియుండినను పూర్ణస్తిమితభావము ఎల్లపుడును సిద్ధించును. సర్వాంశములను పూర్ణన్యాయము లభించును.

6. మనుజుడు తానే తన ఉత్తరస్థితికి నియామకుడు —మనుజుడు తనభావిశీలమునూ తనభావిసంనివేశములనూ నిర్మించువాడు తానే కాని వేఱొకడు కాడు అను అంశమును మనము మఱవకూడదు. సామాన్యముగ చెప్పుచో, వాడు పూర్వజన్మమందు చేయుకర్మలు ఉత్తర

జన్మమందలి సంనివేశముల నుత్పత్తిచేయునవి; పూర్వ జన్మమందలి వాని మనోభావములు ఉత్తరజన్మమందలి శీలము నుత్పాదన జేయుటలో ముఖ్యకారణములు అని చెప్పవచ్చును. ఇదంతయు జరుగు విధానమును పరీక్షించినచో బహుస్వారస్యముగ నుండును. అయితే దాని సవిస్తరముగ వివరించుట అతి దీర్ఘమైనపని. శ్రీమతి ఆనిబెసంటమ్మగారి "కర్మ" అను ప్రకరణ గ్రంథమునను, వారి "పురాణవిద్య (Ancient Wisdom)" యను గ్రంథమందలి కర్మాధ్యాయమందును, సిన్నెట్టుదొరగారి గుప్తబౌద్ధము (Esoteric Buddhism) అనుగ్రంథమునను, ఈవిషయము సమగ్రముగ వివరింప బడియున్నది. జిజ్ఞాసువు వానిని జూచి తెలిసికొన వచ్చును.

7. ఇట్టినియతియే నీతిశాస్త్రమున కాధారము.—ఈ తత్వార్థములవల్ల మన నీతిశాస్త్రములోని యనేకాంశ ములకు అతిసమర్పకమగు ఉపపత్తి కలుగును అనునది స్పష్టము. మనోభావము మహాశక్తిగలదై, మనోలోక మున కార్యమును చేయగలదై, అట్టికార్యము స్థూల ప్రపంచమందు నిష్పన్నముకాదగు నెట్టికార్యము కన్నను

ఎంతో ఘనమైనదయినయెడల, మనుజుడు తోడనే ఆ శక్తిని అవశ్యముగ స్వాధీనపరచుకొనవలసినది స్పష్టము గదా. మనుజుడు తనమనోభావములచే తనభావిశీలమును నిర్మించుకొనుటయే కాక, వానిచే తనచుట్టుననుండు వారియందు సదా అనివార్యముగ వ్యత్యాసముల గలుగ జేయుచుండును.

8. మనోభావమందలి జవాబ్దారి—కాబట్టి ఆశక్తిని వినియోగించుటలో అతనిపై అతిఘనమైన జవాబ్దారి యున్నది. సామాన్యమనుజునకు కోపముగాని ద్వేషము గాని కలుగునపుడు, మాటచేగాని చేష్టచేగాని ఏదో యొక ద్వారముగ దానిని వ్యక్తపరచుటకు సహజముగ ప్రేరణకలుగుచున్నది. అయితే నాగరక సంఘమందలి కట్టుబాటున వాడట్లుచేయదగదు. తనమనోభావములను బయటచూపక సాధ్యమైనంతవరకు అణచిపెట్టవలయును. ఇట్లు చేసి సాధించినచో నేను ధన్యుడయితిననియు నాకర్తవ్యమునంతను నెరవేర్చితిననియు నెంచుట సహజము. అయితే గుప్తవిద్యాపరునకేమో, ఆత్మనిగ్రహమును ఇంకను బహుదూరము సాగించుట ఆవశ్యకమని తెలియును. లోపలి కోపమువల్ల గలుగు బాహ్యాచేష్టలనే

కాక కోపమను మనోభావమునే బొత్తిగ అణచవలెనని అతనికి తెలియును. అదేలయనగా, మనోభావములవల్ల జ్యోతిర్లోకమున (Astral Plane) ప్రచండశక్తులకు ప్రవృత్తిగలుగుననియు, స్థూలలోకమున వేయబడునట్టులనే ఆశక్తులయేటు కోపపాత్రములపై నవశ్యముగ పడుననియును, అనేక సందర్భములందు అట్టి యేట్లఫలము స్థూలఫలముకన్న ఎంతోఘనమై స్థిరతరముగ నుండుననియు అతనికి తెలియును.

వాస్తవముగ మనోభావములును అన్వర్థముగనే పదార్థములు. యోగదృష్టికి (Clairvoyant Sight) మనోభావముల ఆకారములును వన్నెలును స్పష్టముగ కనబడును. వాటి స్పందవేగముల ననుసరించి ఆకారములును వన్నెలును వేఱువేఱుగ నుండును. ఈ ఆకారములను వన్నెలను గురించిన విచారము అతిస్వారస్యమైనది. చిత్రపటములచే విశదపరచబడియుండు వాని వివరమును లూసిఫర్, 1896 సెప్టంబరు పత్రికలోని వ్యాసమున చూడవచ్చును. (ఇటీవల వేఱు గ్రంథముగ ప్రకటిత మయ్యె)

9. మన కర్తవ్యాంశములు — ఈ యంశములను యోచించగ పలుకడల మనము చేయదగిన కార్యములు

స్ఫురించుచున్నవి. మనోభావముచే అపాయము చేయుటకు నుసాధ్యమగునటులనే దానిచే మంచిది చేయుటకును సాధ్యము. మన మిత్రులనేకులు బాధపడుచుండు నపుడు వారికి మనసా సహాయపడి బాధోపశమమును కలుగచేయుటకై వారితట్టు తగిన మనోభావ ప్రవాహములను పంపవచ్చును. ఇవ్విధముగ ఒక క్రొత్త ఉపకారప్రపంచ మంతయును మనకు లభ్యమగును. అనేకమంది కృతజ్ఞులు తమకు పలువిధములుగ ఉపకారము చేసినవారికి తగిన ద్రవ్యసంపత్తు లేనందున ప్రత్యుపకారము చేయుటకును కాకపోయెనే యని వ్యసనాక్రాంతులై యున్నారు. అయితే అట్టివారికి ఈ ఉపాయము సిద్ధముగనున్నది. అందుచే ఉపకారికి మానసప్రపంచమున అత్యధికమైన ప్రత్యుపకారము చేయవచ్చును. ఆ ప్రపంచమున ద్రవ్యసంపత్తు ఉండినను లేకపోయినను ఏమియు వ్యత్యాసము లేదు.

10. ఆత్మగుణశక్తుల వికాసము—తలంచ శక్తిగలవారందరు ఇతరులకు సహాయము చేయ శక్తిగలవారే. ఇతరులకు సహాయము చేయశక్తిగల వారందరు అవశ్యముగ సహాయము చేయవలెను. ఇతర విషయములందు

వలెనే ఈ విషయమునను జ్ఞానము శక్తియగుచున్నది; పదార్థధర్మజ్ఞానము గలవారికి దానిని వినియోగించు శక్తియును గలుగుచున్నది. కొన్నిమనోభావములు తమకును ఇతరులకును ఎట్టి ఫలితాంశముల గలుగచేయునో దానిని తెలిసికొనినందున వారు తామై సంకల్పించి అట్టి ఫలితాంశముల నుత్పత్తిచేయదగిన యేర్పాటు చేయగలరు. ఇవ్విధముగ ఒక మనుజునకు ఈ జన్మమందలి తనశీలమును క్రమముగ చక్కపెట్టుకొన శక్తి యుండుటయే కాక ఉత్తరజన్మమందు తన శీల స్వభావ మెట్లుండదగినదానిని నిర్ణయింప శక్తి కలదు. అదేలయనగా, మనోభావమనగా మానసశరీరములోని భూతముల స్పందమేకదా. ఒక మనోభావమును పట్టుపట్టి అభ్యసించినయెడల కారణశరీరమందలి భూతాంశములందు ఒక మెట్టుపైగ తత్సదృశమైన స్పందమును ఉత్పాదనచేయును. ఇట్లు క్రమక్రమముగ ఆత్మయందు గుణములు ఆవిర్భవించుచున్నవి. ఈ గుణము ఉత్తర జన్మారంభమున జీవుని మూలద్రవ్యమున నొకభాగమై అభివ్యక్తమగుట నిశ్చయము. ఈ రీతిగ క్రిందినుండి పైకి పోవ జేయుకృషిచే ఆత్మగుణములును ఆత్మశక్తులును

క్రమేణ వికసించును. ఈ రీతిగ మనుజుడు తన పురోభివృద్ధిని శానామట్టుకు తన చేతనుంచుకొని భగవంతుని మహారచనయందు వివేకముతో తోడ్పడుటకు ప్రారంభించుచున్నాడు. ఈ విషయమై అధికాంశముల దెలియ గోరువారు చదువదగిన గ్రంథోత్తమ మెద్దియనగా శ్రీమతి బెసంటమ్మగారు వ్రాసిన "సంకల్పశక్తి, దాని నిగ్రహము, దానికృషి" (Thought Power, its Control and Culture).

---

## దశమాధ్యాయము

### బ్రహ్మవిద్య మనకు భోధించున దేమి

1. బ్రహ్మవిద్యవల్ల గలుగు మాఱ్పులు—ఈ బ్రహ్మవిద్యాతత్త్వాంశములు సమగ్రముగ మనుజుని అవగాహనకు వచ్చినతోడనే, లోకయాత్రవిషయమైన అతని యభిప్రాయమంతయు ఎట్లు బొత్తిగమాఱునో అది పూర్వాధ్యాయములను సావధానముగ చదివిన వారికి ఈవరకే స్పష్టమైయుండవలెను. ఆమాఱ్పులు ఎటుప్రక్కల నుద్భవిల్లునో, ఏ కారణములబట్టి ఆ మాఱ్పులు కలుగునో, ఇవియుకూడ పూర్వగ్రంథభాగము వల్ల స్పష్టము కాగలదు.

2. మన జీవితము సప్రయోజనము—బ్రహ్మవిద్యా సిద్ధాంతమువల్ల ఈ లోకయాత్ర విషయమున యుక్తి యుక్త మగు అవగాహన మనకు కలుగుచున్నది. ఆ విషయము ఇంతకుమునుపు మనలో ననేకులకు సంశయ గ్రస్తముగనుండెను. ఆ సమస్యకు ఉత్తరము దొరకకుండె.

ఈ బ్రహ్మవిద్యాసిద్ధాంతమువల్ల, మనమేల యిక్కడ నున్నాము, మన కర్తవ్య మేమి, ఆ కర్తవ్యము నెవ్విధముగ మనము సాధింపదగినవారము, అను నీ యంశములు మనకు తెలియవచ్చుచున్నవి. స్థూలప్రపంచమునకే చేరిన సుఖలాభములను మాత్రము పట్టిచూచినచో ఈ జీవితమువలని ప్రయోజన మెంతో అల్పముగ కనబడును. అయితే పై లోకమందలి వాచామగోచరమగు వైభవములనూ అనంత విభూతులనూ పొందుటకు ఈజీవితము మనలను సిద్ధపరచు పాఠశాలవంటిదను నంశమును ఆలోచించినచో ఈ జీవితమువల్ల మహాప్రయోజనముగలదని అతిదృఢముగ చెప్పదగినదే. ఇది బ్రహ్మవిద్యవల్ల మనకు స్పష్టమగుచున్నది.

౪. ఇతరులకు సహాయపడుట—మనకు లభించియుండు తత్వజ్ఞానమువల్ల మనలను ఏలాగు ముందు అభివృద్ధిపరచుకొనవచ్చు ననునదియే కాక ఇతరులుకూడ అభివృద్ధియగుటకు ఏలాగున మనము సహాయపడవచ్చునను నదియుకూడ తెలియవచ్చుచున్నది. మన మనోభావమువల్లను మన దేహచేష్టవల్లను మొట్టమొదట మనకు అతిసంనిహితులు అథవా ముఖ్యప్రీతిపాత్రులగు కొద్దిమంది

కైనను బహు ఉపకారముచేయ గలుగుదుము. అటుపైన క్రమక్రమముగ మనశక్తి హెచ్చుచురాగా మానవకోటి కంతయు సహాయపడ గలుగుదుము. ఇట్టి సంకల్పమనో భావములచే మనము ఎంతో ఉన్నత అంతస్తు నెక్కి యున్నామనునది మనకే తెలియవచ్చుచున్నది. ఇం తకుమునుపు మనలో పలుమారు ఉదయించుచుండిన కేవల స్వార్థప్రయోజకమగు అల్పమనోభావము ఎంత నీచమైనదియు ఎంత హేయమైనదియు స్పష్టమగుచున్న ది. ఏ విషయమునను మన అత్యల్ప స్వప్రయోజనమునకు సంభవించు సాధకబాధకములను మాత్రమే యోచిం చక మానవకోటికంతకు దానివల్ల నగు సాధకభాధకము లనుకూడ యోచింప మొదలుపెట్టుదుము.

4. స్వార్థవర్జనము—మనకు సంభవించు వివిధకష్ట దుఃఖములు, మనకు అతి సంనిహితములుగావున, సహజ ముగనె అతిహెచ్చుగ కనబడును. కండ్లదగ్గిరనుంచబడిన తట్ట సూర్యప్రకాశము నెట్లు కప్పివేయునో, ఆలాగున మన స్వంత కష్టదుఃఖములు మన దిఙ్మండలమంతను కప్పివేయునట్లుండును. అందుచే సర్వవస్తువులందును స్వర్గసుఖమున్నదను సంశమును మనము మరచుట సహ

జము. బ్రహ్మవిద్యాపరిచయము గలవారమేమో ఇట్టి విషయములను యథార్థ దృష్టితో చూడగలుగుదుము. బ్రహ్మవిద్యాబలముచే అట్టి మబ్బునంతయుదాటి దానిపై కెక్కి క్రిందిపదార్థములను పైనుండి చూడగలుగుదుము. అపుడు అతిసంకుచితదృష్టితో క్రిందనుండి చూచునపుడు అగపడునట్లుకాక, వాటిని యథావత్తుగ గ్రహింపగలము. మోహాదురభినివేశజాలయుక్తమై ఎద్దానిని యథావత్తుగ తెలియలేకయుండు మన నికృష్టాత్మను దాని దోషములతోసహా బొత్తిగ కుంగగొట్టగలము. అపుడు అహంభావరహితమై స్వార్థవర్జితమైన స్థితికెక్కిన వారమైన మనకు ధర్మమును ధర్మార్థమై (నిర్వ్యాజముగ) యనుష్ఠించుటయే మన కర్తవ్యమనునది స్పష్టమగును. మనతోటిపాటి మనుజునకు సహాయపడుట ఉత్తమోత్తమ సుఖదాయకమని తోచును.

౬. ఒట్టున లోకగతియంతయు క్షేమకరమే—అదేల యనగా, ఇపుడు మనకెదుట తెరవబడియుండు జీవిత మార్గము ఆనందమయమైనది సుమా! మనుజుడు అభివృద్ధి కాను కాను అతని కరుణయు మైత్రియు హెచ్చుచు పోవును. కావున లోకుల పాపదుఃఖబాధలు వాని

మనస్సున నంటుట హెచ్చగును. అయితే ఇదిట్లుండ గా ఆ బాధయొక్క కారణము కూడ అతనికి విశదతర మగుచు వచ్చును. ఇట్టిబాధయుండినను క్రియాంశము లన్నియు చేరి సర్వప్రాణుల క్షేమమునందే పర్యవసాన మగుచున్న దనునది అతనికి బాగుగ అవగాహన మగుచువచ్చును. కాబట్టి సర్వము క్షేమకరముగనే యున్న దను నిశ్చయజ్ఞానబలమువల్ల అగాధతృప్తియు పూర్ణనిర్భయత్వమును అతనికి లభించును. ఇంతేకాక, ఈశ్వరుని అద్భుత జగద్రచనాప్రకారమునూ, ఆ మహా రచన యెంత నిర్విఘ్నముగ ఉద్దిష్టగమ్యస్థానము తట్టున ఏకరీతిగ అడ్డిలేక నిర్వాహమగుచుండుటనూ ఆలో చించగా ఒకవిధమైన ఆనంద ముద్భాసించును. మనము ఆనందానుభవముతో నుండవలెననియే ఈశ్వరుని యు ద్దేశమని అతనికి తెలియును. ఆనందముతో నుండుట మన ముఖ్య కర్తవ్యమే యనియు వాడు భావించును. అందుచే మనచుట్టు ఇతరులపై మనలనుండి ఆనంద స్పందముల వ్యాపింపజేయవచ్చును. లోకమందలి దుః ఖమును తగ్గించదగు మార్గములలో అది యొకటి కదా.

6. మనుజుని వ్యథకు కారణము—సామాన్యస్థితి యందు మనుజులు తమ కష్టముల గుఱించి యనుభవించు వ్యథలో బహుభాగమునకు గారణమేమనగా ఆ కష్ట ములు తమకు అన్యాయముగ తటస్థించినవను భావమే. « ఇదంతయు నాకేల సంభవించవలెను? నాపక్కయింటి వాడున్నాడు. ఏవిధముననను వాడు నాకంటె మంచివాడు కాడు. అయినను అతనికి రోగముచే కాని మిత్రవియో గముచే కాని ద్రవ్యనష్టముచే కాని కష్టము సంభవించ లేదే, నేనేల కష్టపడవలెను" అని యొక మనిషి చెప్పును.

7. కష్టానుభవమునుండి ఎట్లు మేలుపొందుట— బ్రహ్మవిద్యావరులకు ఇట్టి దురభిప్రాయము గలుగదు. ఏలయనగా ఎవనికిగాని తనకు రాదగని బాధ ఎన్నటికి సంభవించదని బ్రహ్మవిద్యాసిద్ధాంతము వారలకు నిస్సం శయముగ స్పష్టపరచుచున్నది. మనకు ఎట్టి కష్టము సంభవించినను, మనము చేసికొనిన ఋణస్వరూపమే యది. ఋణము దీర్చుట అవశ్యముగాన ఎంత శీఘ్ర ముగ దానిని తీర్చెదమో అంతమంచిది. ఇంతమట్టుకే కాదు! అట్టి కష్టము ప్రతియొకటియు పురోభివృద్ధికి అవకాశమిచ్చును సుమా. దానిని మనము ఓర్పు గలిగి

ధైర్యముతో సహించుచు రావలెను. దానిచే నలగగొట్ట పడక, దాని నెదుర్కొని, దానివల్ల గలుగదగు లాభ మంతను పొందుచు వచ్చినట్లైన, మనలో ధైర్యము, పట్టుదల, అధ్యవసాయము మొదలగు కల్యాణగుణముల వికసింప జేసికొనగలము. ఇవ్విధముగ పురాతన దు ష్కృత ఫలానుభవమునుండి కీడునకు బదులుగ మేలునే తెచ్చుకొనుదుము.

8. ఇతరులమరణము గుఱించిన వ్యసనము లేదు— బ్రహ్మవిద్యాపరునకు మరణభయమంతయు బొత్తిగ నివ ర్తించునని పూర్వమే చెప్పబడె గదా. అదెట్లనగా, మరణస్వభావమును అతడు పూర్ణముగ తెలిసికొని యున్నాడు. తనకు ముందుగా చనిపోవు వారివిషయ మై వాడు ఇక వ్యసనపడుటలేదు. ఎలయనగా, వా రలు అతనికి ఇప్పటికి సంనిహితులైయే యున్నారు. తన స్వంత దుఃఖమునకు వశుడై ఖేదించినచో చనిపో యినవారలకు ఖేదవిషాదములను కలుగచేసినట్లగునని అతనికి తెలియును. వారలు అతనికి అతి సంనిహితులై యుండుట బట్టియు, ఉభయులకు గల సానుభవము పూర్వా మెన్నటికంటెను సంనికృష్టమైనందునను, పట్ట

రాని విషాదమునకు ఆస్పదమిచ్చినట్టైన అది వారియం దు నిశ్చయముగ ప్రతిఫలించునని అతడు చక్కగ తెలిసికొనియున్నాడు.

9. మృతుల కెట్లు సహాయపడుట—ఇందువల్ల, మృతులైనవారిని మరచిపోవలెనని బ్రహ్మవిద్య చెప్పుచున్న దని తలచరాదు. అట్లుకాక, మృతులను సాధ్యమైనంత వరకు పదేపదే జ్ఞప్తిచేసికొనుటకు బ్రహ్మవిద్య ప్రోత్సాహపరచుచున్నది. అయితే, తన స్వంత వ్యసనము బట్టికాని, మృతులను తిరిగి భూలోకమునకు దేవలెనను ఆశచేగాని, తనకు గలిగిన వియోగభావమును బట్టికాని జ్ఞప్తిచేసికొనరాదు. వారి లాభాతిశయమునకే వారిని జ్ఞప్తిచేసికొనదగును. బ్రహ్మవిద్యాపరునకు ఒక అంశము స్పష్టము. అదేమనగా, తన బలవత్తైన ప్రేమభావన మృతుల అభివృద్ధికి అత్యంతసాధక మగును. వారిని గుఱించి సరిగా న్యాయముగా మాత్రము తాను భావనచేసి నట్టైన వారి ఉత్తరాభివృద్ధికి అత్యంత సహాయము కాగలదు. ఈ విషయమున అతనికి ఏ సంశయము లేదు.

10. మనుజుని జీవితకాలమున స్వర్గవాసకాల భాగమే హెచ్చు—భూజన్మముల రెంటికి మధ్యకాలమందలి

మనుజుని జీవితభాగమును చక్కగ పరిశీలించినచో ఒట్టు జీవితమందు ఈ స్థూలశరీరమందలి జీవితము ఎంతో అల్పాంశమనునది స్పష్టమగుచున్నది. విద్యాసంస్కారవంతుడగు ఉన్నత జాతీయ సామాన్య మనుజుని విషయమందు ఒక జీవితకాలము—అనగా వాస్తవ జీవితమున ఒకదినము—సరాసరి పదునైదు వందల సంవత్సరము లుండును. ఇన్ని ఏండ్లలో సుమారు డెబ్బది ఎనుబది ఏండ్లు స్థూలశరీరమందును పదునైదు ఇరువది సంవత్సరములు జ్యోతిర్మయ (Astral) లోకమునను, గడచిపోవును. తక్కు భాగమంతయు స్వర్గలోకమున గడచును. కావున స్వర్గలోకవాసమే మానవుని జీవితమందలి నిండా ముఖ్యమైనభాగము. వివిధ సంస్కారవంతులగు మానవులలో ఈ లోకత్రయవాసకాలవిషయమున కానా వ్యత్యాసములు కనబడుట సహజమే. మానవ నిమ్నవర్గములలో పుట్టియుండు, అథవా మన వర్గములోనే నిమ్న జాతులలో పుట్టియుండు, చాల జీవుల విషయము నెత్తికొని చూచినచో ఈ భాగములలో అతి వ్యత్యాసము చూపట్టును. ఏలయనగా వారి జ్యోతిర్మయ (Astral) లోకవాసము నిండా హెచ్చుగను

స్వర్గవాసకాలము నిండా తక్కువగను ప్రాయశః ఉండ వచ్చును. కేవల అడవి మనిషికి స్వర్గలోకవాస మను నది యుండనేరదనే చెప్పవచ్చును. స్వర్గలోకవాస మునకు ఆవశ్యకములైన సుగుణములను వాడు ఇంకను తనలో ఆవిర్భావము చేసికొనక యుండుటయే దానికి కారణము.

11. అందరకును మోక్షము గలదను నిశ్చయము—ఈ సంగతులను తెలిసియుండుటవల్ల భవిష్యత్తు ఇవ్విధముగ నుండునని స్పష్టముగను నిశ్చయముగను మనము నిరీక్షించగలుగుదుము. ఇది యెంతో ఆశ్వాసకరమైన సంగతి గదా. ఇట్టి అంశములందు ఇప్పటివారికి సామాన్యముగ నిస్సంశయ జ్ఞానము లేకుండుట చూడగా ఈ విషయ మెంతో సంతోషకరము. బ్రహ్మవిద్యా పరునకు తన సంరక్షణము అనగా మోక్షమును (Salvation) గురించి ఎట్టి సంశయమును ఉండనేరదు. ఏలయనగా మనిషికి తన అవిద్యతప్ప వేఱొకటి భయకారణము లేదు కావున సంరక్షణమే అవశ్యము కాదని అతడు తెలిసికొనియున్నాడు. ఈశ్వరుడు సృజించిన ప్రజలలో ప్రతియొకరి విషయమై అతని సంకల్పము నిశ్చయముగ నెర

వేరగలదను దానిని సంశయించుట ఒక మహాపరాధ మనియే బ్రహ్మవిద్యాపరుడు ఎంచును.

12. ప్రపంచపురోవృద్ధికి సహాయపడుట—బ్రహ్మ విద్యాపరుడు మోక్షము గుఱించి కేవల "శాశ్వత ప్రత్యాశ (Eternal hope)" మాత్రముతో నుండువాడు కాడు. శాశ్వత ధర్మముయొక్క గతిని తెలిసికొని యున్నాడు కావున, మోక్షము గుఱించి అతనికి దృఢ నిశ్చయము కలదు. అతనికి భవిష్యత్తు బాగుగ తెలిసి యుండుట బట్టి దానిని గుఱించి భయమే లేదు. కాబట్టి ప్రపంచపురోభివృద్ధి కార్యమున తన భాగమును నిర్వహించుటకు కావలసిన యోగ్యతను ఎట్లు సంపాదించదగునను విషయమునే అతడు చింతించదగినది. ఇక్కార్యమున ఇపుడు వాడు చేయగలిగినది అతి స్వల్పముగనే యుండవచ్చును. అయినను, తానుండుచోటనే తన చుట్టుముట్టు ప్రదేశములో, ఆ ప్రదేశము ఎంత నికృష్టమైనను, కొంచెమైన చేయలేనివా డెవడును లేడు.

13. సహాయపడుటకు దగిన సమయములు—ప్రతియొకనికిని సమయములు దొరకుచునే యున్నవి. ఇతరులతోటి ప్రతియొక విధమైన సంబంధమును ఒక సమ

యమే సుమీ. మనతో సంబంధపడువారిలో ప్రతి యొకరును మనము సహాయపడదగిన జీవమే. ఆజీవము మన కుటుంబములో శిశువుగ పుట్టియుండవచ్చును, లేదా మనగుంపుకుచేరిన ఒక స్నేహితుడుగ నుండవచ్చును, లేదా మనకుటుంబములో పనిచేయు నౌకరిగ నుండవచ్చును. ఒక విధమున కాకపోయినను మరియొక విధమున ప్రతియొకరును మనకు సమయము కలుగచేయుచున్నారు. ఇందువల్ల, మనము సంధించు వారిలో ప్రతియొకరికిని, వారికి ఇష్టము లేకపోయినను, మన భావాభినివేశములను వెల్లడిపరచి వినుకుపుట్టించవలెనని సూచింప నుద్దేశ మెప్పటికిని లేదు. కొన్నివేళలలో మన మతాభిమానులగు స్నేహితులపైకి అజ్ఞులై సమయోచితము తెలియనివారు కొందరు అట్లు వినుకు పుట్టించుట కలదు. అయితే మన కర్తవ్యమేమనగా, సహాయపడుటకు సదా సిద్ధముగ నుండవలసినది.

14. మనోవాక్కాయములద్వారా సహాయపడుట— సహాయము చేయుటకుదగిన సమయమును మనము కుతూహలముతో నిరీక్షించుచునే యుండవలయును సుమా! మనశక్తికొలది ద్రవ్యసహాయము చేయవచ్చు

ను. లేదా అడిగినపుడెల్ల సలహాచెప్పిగాని మనకు గల జ్ఞానము వినియోగించిగాని సహాయపడవచ్చును. మాటచేగాని శరీరవ్యాపారముచేగాని మనము సహాయము చేయ వీలులేని సందర్భములు మెండుగ తటస్థించును. అయితే ఎట్టిసందర్భముననుు ప్రీతియుక్తమై సహాయకరమగు సంకల్పమును పంప వీలులేక పోదు. సంకల్పశక్తిని తెలిసినవాడెవడును, దానిఫలము స్థూలప్రపంచమున తత్క్షణమే కనబడకపోయినను, దానినిగురించి సంశయము పెట్టుకొనడు.

15. బ్రహ్మవిద్యాపరుడు శుభమునే నిరీక్షించును—

బ్రహ్మవిద్యాపరునకును ప్రపంచమందలి ఇతరులకును ఉండవలసిన భేదమేమనగా అతడు సదా సంతుష్టుడైయుండవలెను. కష్టములు వచ్చినపుడు అనివార్యధైర్యము వహించవలెను. ఇతరుల కష్టసుఖముల దెలిసి వారికి సహాయముచేయుటకు సిద్ధముగ నుండవలెను. సదా సంతుష్టుడై యున్నను తన లోకవ్యవహారములో గంభీరముగ యోచించి తనకర్తవ్యమును చేయుచువచ్చును. ప్రతియొకడును ప్రపంచమున చేయదగిన పని మెండుగ నున్నందున ఏ మాత్రము కాలహరణము చేయకూడదని

అతడు రూఢిగ తెలిసికొనియున్నాడు. పూర్ణమైన ఆత్మ నిగ్రహమును శరీరనిగ్రహమును అవశ్యముగ సంపాదించ దగినవని అతనికి స్పష్టమగును. అదేలయనగా, అవి సిద్ధించిననే, సమయమువచ్చినపుడు ఇతరులకు పూర్ణముగ సహాయము చేయుటకు అతనికి సాధ్యమగును. హీనభావమునువదలి ఉదారభావపక్షముననే ఎప్పుడును చేరుకొనును. నీచపక్షమును వదలి ఉత్కృష్టపక్షమునే ఆశ్రయించును. అన్నిటిలోను మంచిదే అతనికి అగపడుటవలన అతనికి పరిపూర్ణమైన అద్వైతభావము సిద్ధించును. ప్రతివిషయమునను బాగుగ ఆలోచించి శుభపరిణామమునే నిరీక్షించునుగాని అశుభపరిణామమును సరకుకొనడు. మేలునే నిరీక్షించునుగాని కీడును తలంచడు. ఏలయనగా వస్తుస్థితిలో ముఖ్యాంశమున ఎప్పటిగి శుభమే పరిణమించునని అతనికి తెలిసియున్నది. కడాన శుభమే నిలుచును కావున వస్తుస్థితిలో ఏవిషయమునను అశుభాంశము అనిత్యమే కదా.

16. ఈశ్వరునకు సహాయభూతుడగుట—ఇట్లు బ్రహ్మవిద్యాపరుడు ప్రతిదానిలోను సుగుణమును కనిపెట్టి ఆసుగుణమును బలపరచ యత్నించును. మహాత్మైన

ధర్మాభివృద్ధిగతిని కనిపెట్టుకొనియుండి దానిని తెలిసి కొనినపుడు ధర్మపక్షమువహించి ఆ ధర్మశక్తిమహా ప్రవాహామునకు తన స్వల్పశక్తిప్రవాహామును చేర్చును. ఈ రీతిగ ఎప్పటికిని విఘ్నముచేయక సదా సహాయమే చేయుటకు యత్నించుచు అతనిశక్తిప్రసరించు స్వల్ప మండలమునకు ప్రకృతిమండలమందలి మహోపకార నిర్వాహకులలో నొకడు కాగలడు. అతని అంతస్తు ఈశ్వ రునికన్న ఎంత తక్కువయినను, వారిద్దరికినుండు అంత రాళ మెంత అచింత్యమైనను, వాడును ఈశ్వరునితో కూడ సహాయభూతుడై పనిచేయువాడే. అదే మాన వుడు ఎన్నటికిగాని చెందదగిన అత్యుత్తమ గౌరవము, అతి మహత్తైన అధికారము.

సమాప్తము

ఓమ్ తత్ సత్

---

# దివ్యజ్ఞానదీపిక ఆఫీసులో దొరకు తెలుగు గ్రంథములు

## Theosophy

దివ్యజ్ఞానసారము— చిట్టిమూరు రామయ్యగారు Theosophy ని గుఱించి వ్రాసిన ఉపన్యాసములు. 0 8 0

పరమగురుచరణసన్నిధి— శ్రీ జిడ్డు కృష్ణమూర్తి గారిచే ఇంగ్లీషున రచితమైన గ్రంథముయొక్క చి॥ రామయ్యగారి ఆంధ్రీకరణము. 0 4 0

ఆత్మవిచారము— అద్దంకి సీతారామశాస్త్రులగారిచే రచితము. Theosophy గుఱించినది. హిందూశాస్త్ర వచనములు పెక్కుగ నుదాహృతములు. (పూర్వ భాగము.) 1 8 0

మీలోకము, మాలోకము (స్వార్థము, పరార్థము)— శ్రీ బెసంటమ్మగారి 1922 వార్షిక సమ్మేళ మందలి రెండు ఉపన్యాసముల సంగ్రహము. చి. రామయ్య రచితము. 0 3 0

బ్రహ్మవిద్యాసారము— యోగి లెడ్బీటరుగారి "An Outline of Theosophy". అ. మహాదేవ శాస్త్రిగారిచే ఆంధ్రీకృతము. 0 10 0

## Theosophy and Hinduism

బ్రహ్మవిద్య— శ్రీమతి బెసంటమ్మగారి హిందూమత-దివ్యజ్ఞాన విషయములైన రెండు ఉపన్యాసములు. చిట్టిమూరు రామయ్యగారిచే ఆంధ్రీకృతము. 0 3 0

రామాయణసంగ్రహము—శ్రీ బెసంటమ్మగారి యుపన్యాసములు. వి. గోపాలయ్యగారిచే ఆంధ్రీకృతము. 1 0 0

బ్రహ్మవిద్యాదర్పణము—చి. రామయ్యగారిచే రచితము. ఇందున హిందూమత సిద్ధాంతము Theosophy దృష్టితో చక్కగ ఉపపాదింపబడియున్నది. రెండవకూర్పు. సవరింపబడినది. 1 4 0

## Hinduism

బ్రహ్మసూత్రసారము—వా. వెంకట శివావధానిగారిచే రచితము. 1 4 0

భాగవతసారము— ,, 1 8 0

భక్తియోగము—జం. శ్రీనివాసరావుగారిచే రచితము. 0 8 0

వేదోక్తధర్మతత్వము—అ. మహాదేవశాస్త్రి రచితము. ఇందున ముఖ్యములైన హిందూమతాచారముల తత్వము మూలప్రమాణానుసారముగ నిర్ణయింపబడియున్నది. 0 6 0

---

సిద్ధాశ్రమము—మొ. వెంకటారావుగారు రచించినది. ఇది పారమార్థిక నవలవలె నున్నది. ఒక ముముక్షువుయొక్క అనుభవములను దెలుపునది. చదువరులకాహ్లాదకరము. [illegible] 0

# దివ్యజ్ఞానదీపిక

**A Telugu Monthly Organ of Theosophy**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక

**Editor: Pandit A. Mahadeva Sastri, B.A.**

సంపాదకుడు: అ. మహాదేవశాస్త్రి, బి. ఏ.



## చందాదారులకు సూచన



పత్రికా కార్యస్థానము:—అడయార్ (మదరాస్)

సంవత్సరమునకు తపాలాకూలిచేరి చందా 1 రూపాయి

చందాదారులు తమ చందాసొమ్మును మనియార్డరు మూలకముగ పంపుట మంచిది. వి. పి. చేసినయెడల వారికి రెండు అణాలు హెచ్చుగ ఖర్చుపడును.